# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామ శాస్త్రి.

సంపుటము 1 | రాజమహేంద్రవరము 16-6-1978 | సంచిక 16

—* ఈ సంచికలో *—



1—7—78 సంచికలో తిక్కన యజ్వపరిపూర్ణయోగము, బహుముఖవిజ్ఞాన విధానం లీలావతీ గణితము, పిరదౌసి ప్రకృతి వర్ణన మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

# నిరంకుశోపాఖ్యానం - సాంఘిక దృష్టి

— డాక్టర్ వి. వి. యల్. నరసింహారావు

ప్రాచీనులయిన తెలుగుకవులకు సామాజిక స్పృహ చాలా తక్కువనే అపప్రథ వుంది. ఉత్ప్రేక్షాతిశయోక్తులతో కూడిన వర్ణనలకు పట్టంకట్టిన ప్రబంధ కవులు ఈ అపప్రథకు మరింత గురైనారు. ఊహాకు రెక్కలు గట్టుకుని విహాయస వీథుల్లో విహరించడంలో వున్న సరదా– వీరికి– నేలమీద నిలిచి మనుషుల బ్రతుకు లోతుల్లోని కష్టనష్టాలు పరామర్శించటములో లేదని దీని తాత్పర్యం. ఈ అపప్రథ తొలగించడానికి చాలవరకు ప్రయత్నించిన తొట్టతొలి ప్రబంధకవి కందుకూరి రుద్రకవి.

ఈయన రచించిన నిరంకుశోపాఖ్యానం సాంఘికమైన తొలిప్రబంధం.

సాంఘికమైన ఒక సమస్య గ్రహించి కథాంతంలో దానికొక పరిష్కారమార్గం కూడా చూపుతూ అందుకోసం నాలు గాశ్వాసాలు నిండుప్రబంధాన్ని వినియోగించాడీకవి. బంగారపు బొమ్మలాంటి భార్య యింట్లో వుండగా– బజారుబొమ్మల కోసం ఎగబడి భ్రష్టులైనవారి బ్రతుకులు అట్లా కడతేరవలసిందేనా? వాళ్ళి కట్టుకున్న అమాయికపు ఇల్లాండ్ర కన్నీరు మున్నీరు కావలసిందేనా? ఈ సమస్యకు పరిష్కారం లేదా? – 'ఉన్నద' అని నిరూపించిన కావ్యం నిరంకుశోపాఖ్యానము. అందుకే ఒకవిధంగా ఇది నాకు నచ్చిన కావ్యమూ, నేను మెచ్చిన కావ్యమూను.

అయితే వెలయాండ్ర కౌగిళ్ళు మరిగి బ్రతుకు బండలుచేసుకున్న భ్రష్టుల కథలు వ్రాసిన కవులు రుద్రకవికంటే ముందు కొందరున్నారుకదా? పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రలో మల్హణునికథ, శ్రీనాథుడు శివరాత్రి మాహాత్మ్యంలో సుకుమారుని కథ, కాశీఖండంలో గుణనిధికథ, పోతన భాగవతంలో అజామీళునికథ – వ్రాశారుకదా! మరికొంత ఇవతలికి వచ్చిచూస్తే – ఎడపాటి ఎఱ్ఱన మల్హణచరిత్ర, రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యంలో నిగమశర్మకథ, ఉద్భటారాధ్య చరిత్రలో మదాలసుని కథ, ఘటికాచల మాహాత్మ్యంలో హరిశర్మకథ, హరిభట్టు నారసింహపురాణంలో మందేహుని కథ – నిరంకుశోపాఖ్యానం వంటి కథలు కావా? కావచ్చు. కాని కథల పర్యవసానంలోనూ, పరమార్థంలోనూ భేదముంది. గుణనిధి నిగమశర్మాదులు ఏ బోళాశంకరుడి దయవల్లనో, ఏ క్షేత్ర మాహాత్మ్య విశేషంవల్లనో హఠాత్తుగా మోక్షం పొందినవారే. ఈ కథ లల్లిన కవులకు క్షేత్రమహిమ యందున్న విశ్వాసము సంసారక్షేత్రమైన ఇల్లాలియందేర్పడలేదేమో అనిపిస్తుంది. అందువల్లనే రుద్రకవి 'నిరంకుశోపాఖ్యానం'లో నిరంకుశుడి భార్యకు ఎంతో ప్రాధాన్యం ఇచ్చాడు.

మాణిక్యపురంలో కర్మసంపన్నులైన సుశర్మదంపతులకు లేక లేక ఒక పుత్రుడు పుట్టాడు. వాడు 'పంచశరాకారుడూ, వచస్సంభార దుర్వారుడూ, వేదాది విద్యానిరంకుశుడూ, అయిన నిరంకుశుడు. ఇంతప్ప[illegible] కాచేలా చూచింది. అత్తమామ లదుపు అతని యిల్లాలు త్రిభువనాశ్చర్యకర సౌందర్య! అయితేనేం? యావనమంకురించగానే అతడు సానివాడల కెగబడ్డాడు. ఆచారం అడుగంటింది. శృంగారం సోడు ముట్టింది. వైదిక వేషం మారిపోయింది. చలువచేసిన సన్నధోవతి లోపల కురచలాగు, వ్రేళ్ళకుంగరాలు. ఒళ్ళంతా గందపుపూత, చక్కని జుట్టుముడి అందులో జాజిపూలు, మగువలకు మరులుపుట్టించే సిగతాయెతులు, ఆపైన ఒంటిపొరరుమాలు ఒల్లెవాటు, ఎందుకైనా మంచిదని చేతిలో చురకత్తి నడుమున తళత్తళలబాకు, ఒహ్హో! కమ్మ కప్పురపు తాంబూలంతో గుభగుభలాడుతూ, గబగబలాడుతూ సానివాడల్లో రాత్రులు నిరంకుశుడై తిరిగేవాడు నిరంకుశుడు. ఇది నాటి ధూర్తవిటులైన తిరుగుబోతుల వేషం కాబోలు!

నిరంకుశుడికి వెలయాండ్రందరలోనూ చంపకగంధి మీద చెప్పరాని మోహం. అందుక్కారణం ఆమె అందమొక్కటే కాదు అనేక కళల్లో ఆమె జాణ. సంగీత సాహిత్యాల్లోనే కాదు పాచిక లాడటంలోనూ ప్రవీణయే.

అత్తచాటు కోడండ్రయిన అమాయికపు ఇల్లాండ్రకు ఈ కళలన్నీ సాధ్యమా? గుట్టుగా కాపురం చెయ్యడమే కాని పదుగురు చూస్తుండగా భర్తను పలకరించడానికూడా వారికి భయమూ సిగ్గూ. మగడు తనంత తాను దారికి వస్తాడేమో అని నిరంకుశుని భార్య, కన్నులు కాయలు

చెయ్యక పోతారా అని, ఆశపడ్డది. తన కొంపగుల్లైపోనీకొంపలు బాగుపడుతున్నై. తన యిల్లు తానే దిద్దుకోవాలి. ఆమె కర్తవ్య పరాయణురాలైంది. తొందరపడి తానే మగణ్ణి మందలిస్తే కార్యం బెడిసి కొట్టవచ్చు. తెలివిగా అత్తగారిచేత ఆపని చేయించాలి అత్తదయగలతల్లే. అయినా అత్తగారు గదా! పెత్తనం-కోడల్ని తిట్టడం, మొట్టడంలోనే కాని కొడుకును మందలించడంలో లేదు. కోడలు కన్నీళ్ళతో అత్తముందునిలిచి దీనంగా అన్నది.

"అత్తవు సర్వలక్షణ స
మగ్ర గుణాఢ్యవు, నన్ను తిట్టనున్
మొత్తను గాని నీకొడుకు
మాధవమానుపవేల ? పాడు రో
తొత్తులమారియై గృహము
క్రొక్కక ఒక్కొకదాని పూనికన్
గుత్తకునంచు ఉంచుకొని
శోకలురూకలు జోక నీయగన్ -

హోమగాడైనను కామాంధవర్తనం బోజగాదని చెప్ప ఉడుగకున్న ?" మీ ఉపేక్షవల్లకాదా ఆయనీస్థితికి వచ్చారు ? అన్నీ చూస్తూనే వున్నానమ్మా నేనొక్కదాన్ని పట్టుకుంటే నిలుస్తుందా? సొమ్మంతా తుడిచిపెట్టుకుపోయి నప్పుడు తెలిసొస్తుంది మీకు !"

శోకావేశాలు ముంచుకురాగా విరక్త భావంతో కోడలు అత్తగారి గుండె జలదరించే మరోమాటకూడా అన్నది.

"నాకేమి, దేహసుఖముల్ పురాకృతమే కాక నేడు రాబోనే ! ఈ; లోకమున నేనె అరుదా ? మాకోడలు గాదొ పొరుగు మంచముకాదో !" పడుచు ప్రాయంలోనే ఆదీనురాలికెంతటి తత్త్వ దృష్టి అలవడింది!

" ఈపాడు తనువు ఇంకెంతకాలం మోస్తానులే!" అంటూ వలవలా ఏడ్చింది. అత్తగుండె చెరువైంది. చీరకొంగుతో కోడలి కన్నీళ్ళు తుడిచింది. కర్తవ్య మాలోచించి ఒకనిర్ణయానికివచ్చింది. అంతలో వచ్చాడు కొడుకు. ఆదరంతో ఆకలితీర్చి, ఆప్యాయంగా నీతులుచెప్పి అందంగా ముస్తాబుచేసి అతగాణ్ణి కోడలి గదిలోకి పంపింది. గదిలోకి వెళ్ళాడు; పెండ్లం మీది ప్రేమతో కాదు; పొద్దుపోయి బైటికి పోతే యమభటుల్లాంటి తలారులు మక్కెలిరగ పొడుస్తారన్న భయంతో.

మగనిపొత్తుకు మొగంవాచివున్న మానవతి — అభిమానం అవతలబెట్టి — ప్రయత్నం ఫలించిం దనే సంతోషంతో "జలకంబాడి, మణుంగుకట్టి, వరభూషా సంఘముల్ దాల్చి, చెంగలువల్ కొప్పున కీలుకొల్పి రతికాంక్షన్ చేర" నేతెంచినది. మగనిమొగాన కించిత్తు కనికరంలేదు. ఆమెగుండె కలుక్కుమంది. అయినా ఓర్పుతో నేర్పుతో —

అలివేణీమణి, సిగ్గుచేత నతవ
క్త్రాంభోజయై రెండుచే
తుల బాగాలొసగంగబోయిన, కృపా
దూరీకృతుండై ఘన
జ్వలన జ్వాల జటాలమైన ఒక ని
శ్వాసంబు గావించి అ
వ్వలి మోమయ్యె,రుచింతురే కులసతుల్
వారాంగనా భోక్తకు ?

రెండుచేతులూ చాచి తాంబూలమివ్వబోతే అతడు పెద్దనిట్టూర్పు విడిచి మొహం తిప్పుకున్నాడు. 'భోగకాంతల్ని అనుభవించే మహాభోక్తకదా ! ఇల్లాలు రుచిస్తుందా ? అని అర్థాంతరన్యాసం. వైదికాచారంలో ప్రసిద్ధమైన భోక్తృ శబ్దాన్ని కవి ఎంత సందర్భోచితంగా ప్రయోగించాడు ?

ఏంచేస్తుంది పాప మాయిల్లాలు? మనసులో మల్లాడే పిచ్చికోరికను జోకొట్టి, నిద్రపుచ్చి, తానూ నిద్రపోయింది. అదే సందని అతడామె వొంటిమీది నగలన్నీ నల్లపూసాదిగా వొలుచుకుని వేశ్యావాటికి వెళ్ళాడు తెల్లవారకముందే ?

తెల్లవారింది సూర్యుడుదయించాడు. ఎట్లా ? "అఖిల జగత్ప్రాణ హరణకాంక్ష పురారి కెంగేలపట్టిన కేడెమనగ" నిష్ఠలాంటి ఇల్లాలికి జరిగిన అవమానానికి ప్రళయకాలరుద్రుడై త్రిపురహరుడు రక్తహస్తంతో పట్టిన డాలులా ఉదయించాడు సూర్యుడు. కథాసందర్భానికి అతికినట్లు, వర్ణనంటే అట్లావుండాలి. ఇక్కడ రుద్రమూర్తియై నిలిచినవాడు రుద్రకవే అనిపిస్తుంది.

వ్యసనాలకు దాసులై, కామం కళ్ళకెగదట్టి, అచ్చుబోసిన ఆంబోతుల్లా తిరిగే మగరాయుళ్ళ మనస్సు మార్చటానికి మహారుద్రులు దిగిరావాలి. మూడోకన్ను తెరచి వాళ్ళని మట్టుపెట్టటం కార్యం కాదు. ఎప్పటికైనా వాళ్ళ మనస్సు మారుతుందేమో నన్న ఆశచావక జీవచ్ఛవముగా పడివున్న ఇల్లాండ్రగతేంకాను?

రుద్రకవికి ఈప్రశ్నే ఎదురైంది. ఇల్లాలిని ఏడ్పించి మొగుడొక్కడే మోక్షంపొందటానికి వీలులేదు. ధర్మపత్నిని మన్నించి గృహస్థధర్మం కాపాడిననాడే మోక్షం. అందాకా అతడు వట్టి గుణనిధే. వట్టి సుకుమారుడే.

అందుకే రుద్రకవి నిరంకుశుని భార్యకు ప్రాణంపోసి నిలిపాడు. ఏ అఘాయిత్యానికీ పాల్పడకుండా చూచాడు. అయితే ఆ నిరంకుశుడు ఇంట అడుగు పెట్టాలి కదా! చేతిలో కాసు లున్నంత వరకు చంపకగంధిని రాత్రింబవళ్ళనక పొత్తరలాడించి గర్భవతిని చేశాడు. కాసులు డుల్లినై. బ్రహ్మరాక్షసి వంటి ఆమె తల్లి నిరంకుశుణ్ణి 'జే పరమేశా' అనిపించింది. అప్పుడైనా అతడింటికి వచ్చాడా? మతిచెడి కారడవులపాలై పాడుబడ్డ శివుని గుళ్లో ప్రవేశించాడు. అవసరాని కాదు కొంటా యని కాబోలు ! కొంగున ముడిచి తెచ్చిన పాచికలు శివుడిముందు విప్పాడు. గెలిచినవారు ఓడిన వారికి వెలయాలి నిచ్చుకోవాలని శివుడితో పందెం. న్యాయంగా ఇద్దరి ఆటా తనే ఆడాడు. తానే గెలిచాడు. ఇచ్చుకునేవాడు

ఈశ్వరుడు గదా! ఎల్లమ్మనూ పుల్లమ్మనూ ఇమ్మనెందుకడగాలి? ఇంద్రలోకపు రంభ నిమ్మన్నాడు. మనస్థిమితం లేని స్థితిలో అతడీవిధంగా ప్రవర్తించాడనుకున్నా — ఇక్కడి నుంచీ కథ సహజమైన సాంఘిక వృత్తానికి భిన్నంగా వింత మలుపులు తిరిగింది.

ప్రతియుగానికీ కొన్ని బలమైన సంప్రదాయాలు, విశ్వాసాలు, కొన్ని భ్రాంతులూ తప్పవు. అసలు మన ప్రాచీన కవులకు దేవతలూ, దివ్యలోకాలూ ఎంతో చేరువ. స్వర్గం కూడా అందుబాటులోనే వుంటుంది. కథలోని వ్యక్తులిక్కడినుంచి అక్కడికీ, అక్కడినుంచి యిక్కడకూ తేలికగా బదిలీ అవుతారు. ముఖ్యంగా ప్రబంధకవులకు కల్పనల మీదకూడా మోజే. లేకపోతే కళాపూర్ణోదయ కథ అంత అందంగా అద్భుతంగా పెరిగివుండేదా? అటువంటి మోజుతోనే రుద్రకవి కూడా సాంఘిక కావ్యంతో అతిలోక కల్పనా భ్రాంతికి లోనైనా డనిపిస్తుంది.

కాముకుడైన నిరంకుశుడికి రంభనిచ్చేందుకు కామదహనుడు ప్రత్యక్షమైనాడు. శివసాక్షాత్కారంతో అతనికి మోక్షకాంక్ష మోసులెత్తింది. పశ్చాత్తాపం కూడా ప్రారంభమైంది. ఈ పశ్చాత్తాపమే అతని పాత్రకు కొంతవన్నె తెచ్చింది.

“అపరాధంబులు పెక్కుచేసితి మహా
హంకార కామక్రియా
విపులాంభోనిధి ద్రుంకబెట్టి జడతా
వేశంబునన్; మిమ్మది
వ్యపథోద్వృత్తిని కొల్వనైతిని మనో
వాక్కాయ కర్మంబులన్;
చపలాత్మున్ ననుబ్రోవ మీదయయకా
సాక్షాత్కటాక్షేక్షణన్!

అతని చపలత ఉడుగలేదు కనుక శివుడు మోక్ష మివ్వక-బలవంతంగా రంభనే ఇచ్చాడు. సంసారభ్రష్టుడైన వ్యసనికి అకాలమోక్షప్రాప్తి రుద్రకవి అభీష్టంకాదన్నమాట. ఏమైతేనేం? నిరంకుశుడికి రంభదక్కింది. ఆ విద్యలో అతి ఉద్దండ పండితుడు. ఆమెకు దివ్యుల వల్ల దక్కని కొత్తరుచి, మెరుపల్లే నిరంకుశుని కౌగిట్లో తోచింది. ‘సర్వం మరచి అతన్ని మెచ్చుకుంటూ రంభ ఆమాటే అన్న’దని నారదుడు పోయి, ఇంద్రుడికి పితూరీ చెప్పాడు. అతడు మండిపడి రంభను పెనురాతి బండవుకమ్మని శపించాడు. ఆమె, కుయ్యోమనే సరికి దయపుట్టి శాప విముక్తికి మార్గం కూడా చూపాడు. రంభవల్ల అది తెలుసుకున్న నిరంకుశుడు తెలివంతా ప్రదర్శించి ఆమెకు శాప విముక్తి కలిగించాడు. ఇంద్రుడు ముగ్ధుడై నిరంకుశుని ఇష్టప్రకారం నిత్యం రంభ వానికోసం స్వర్గం నుంచి వచ్చిపోయే ప్రత్యేక సౌకర్యం కూడా ప్రసాదించాడు.

సాంఘిక కావ్యదృష్టితో చూస్తే - అసలు రంభ రంగంలో అడుగు పెట్టటంతోనే కథ డొంక తిరుగుడు తిరిగింది. ఈ కట్టు కథకు మూలం లేక పోలేదు. అది బృహత్కథ లోని ఠింఠాకరాళు డుజ్జయినిలో ఒక జూదగాడు. పెళ్ళి పెటాకుల్లేవు. జూదంలో గెలిచిన సొమ్ముతో రొట్టెలు చేసుకుని వల్లకాటి నిప్పుల మీద పొర్లించుకు తినేవాడు. మహాకాళుని గుడి ముంగిట తిష్ఠవేసి దేవతల్తో జూదమాడి మహాకాళ దేవుణ్ణే మెప్పించాడు. దేవకాంత అయిన కళావతిని పొంది ఆమె సాయంతో ఇంద్రలోకం వెళ్ళివచ్చాడు. అందు కింద్రుడు కోపించి కళావతిని ‘దేవాలయ స్తంభ సాలభంజికవు కమ్మ’ని శపించాడు. యుక్తిపరుడైన కరాళుడామెకు శాపముక్తి కలిగించగా ఇంద్రుడిట్టే మెచ్చి వాడికి కళావతితో పాటు తన సన్నిధి కూడా ప్రసాదించాడు.

కొంత భూత ప్రేత వాతావరణంలో ఈ కథ, బేతాళ పంచలింశతి కథలాగుంది. లాగేమిటి? బృహత్కథలో ఒక బేతాళుడు మరో బేతాళుడికి చెప్పిన కథేయిది. ఈ ప్రమాదం తప్పించుకుందుకే, రుద్రకవి నిరంకుశోపాఖ్యానాన్ని మునియైన పులహుడి చేత ప్రభువైన ధర్మశీలునకు చెప్పించాడు. ఠింఠాకరాళుడి కరాళత్వం తొలగించి కుమార గుణనిధుల్ని కలిపి నిలిపి నిరంకుశుణ్ణి సాంఘిక కావ్యనాయకుణ్ణిగా మలిచేందుకు మహాప్రయత్నం చేశాడు. ఏమైన, ఠింఠాకరాళుడి నీడసోకి కళావతి స్థానంలో రంభ అడుగు పెట్టే సరికి నిరంకుశోపాఖ్యానంలోని సాంఘికమైన సహజ వాతావరణానికి కొంత అనర్థం వాటిల్లింది. ఈ అనర్థాన్నే రుద్రకవి మహార్థంగా మలిచి కథాంతంలో ఒక ప్రయోజనం కూడా సాధించాడు. అది ఆలోచనామృతమైన మహార్థం.

రంభ కౌగిట్లో నిరంకుశుడు స్వర్గసుఖం చూరలాడుతున్న సమయంలో ఆ పురాణప్రణయిని అతని కొక మనోహరమైన ప్రేమ మంత్రం ఉపదేశించింది. ఆ మంత్రం అతని ఆత్మకు పోయి హత్తుకొన్నది అదేమంటే

“తనువున్ దనువున్ కూడుట
ఘనతర సంసర్గఫలము కాదు; 'తలంపన్
మనమున్ మనమున్ కూడుట
అనుపమసంసర్గఫలము అవని సురేంద్రా!”

ఇందులో సంసర్గమనే మాట సారభూతమైన మాట సమ్యక్ సారభూతమైన మాట. సంసర్గమంటే సామాన్యార్థం సంబంధమనే. బంధం సమ్యక్ బంధం కావాలంటే ధర్మబద్ధమైన సంసారమే శరణ్యం. అంటే రంభ గడుసుగా నిరంకుశునకు సంసారాన్ని జ్ఞప్తికి తెచ్చిందన్న మాట. భూలోకంలో స్థిరంగా వుండే వీలులేని రంభ, అతనికి ఫలోదర్కమైన సంసారాన్ని గుర్తుకు తెచ్చినట్లైంది.

వెనక వేశ్యమాత, నిరంకుశుణ్ణి తన కూతుర్నుండి దూరంగా తరిమి కొట్టేందుకు అతన సంసారం గూర్చి కొన్ని శ్రీరంగనీతులు వల్లించింది.

"కడుపిన్న ప్రాయమప్పుడు తాళి గట్టిన కులము నిల్లాలెంత కుందవలయు? తనయుండు మాకు ముప్పున కందునని కుంగు, తలి దండ్రు లెంత చింతిలగ వలయు? అన్నది. అయితే ఆ నీతులన్ని అతని పీడ వదిలించుకు నేందుకు వల్లించిన నీతులు కాని నేటి ఈ రంభ మాట అటువంటిది కాదు. ఆప్యాయంగా ఆత్మీయతతో అన్నమాట. అందుకే రంభ అనుమతి తీసుకుని నిరంకుశుడు నూతనమైన సంసార జీవితం ప్రారంభించాడు. ఎవరితో? అగ్ని సాక్షిగా పెండ్లాడిన అర్ధాంగితో 'త్రిభువనాశ్చర్యకర సౌందర్య' అయిన ధర్మపత్నితో.

అంతవరకూ వయసంతా అడవిగాచిన వెన్నెలై, ఎండిన మోడులా వున్న ఆ నిస్పృహురాలి నిశ్శబ్దశోక వేదన ఎవరికి తెలుసు? ఆమె శోకార్తిని రుద్రకవి పితృహృదయంతో అర్థం చేసుకుని "నా బిడ్డా! నీ కన్యాయం జరగనియ్యను. తల్లీ! అల్ల ఆనాటి సుకుమారగుణనిధులు అప్పనంగా వచ్చిన మోక్షపదవితో తామొక్కరూ కులుకుతూ పోతే—వారి యిల్లాండ్రు మాత్రం జీవచ్ఛవాలుగా మిగిలి రాలిపోయారు. నీ వట్లా కారాదు. నిరంకుశుడికి ముకుదాడు 'పోసి మళ్ళీ నీ దగ్గరకు రప్పిస్తాను. నీ కాపురం నిలబెడతానమ్మా!' అని కన్నీరు తుడిచి ధైర్యం చెప్పాడో అన్నట్లు ఆమె కాపురం నిలబెట్టాడు. అంచకూనల వంటి బిడ్డలతో ఆ మెయిల్లు కళకళ లాడేట్లు చేశాడు. నిరంకుశునకు పున్నామ నరక యాతన తప్పింది. వ్యసనాల్లో ప్రథమవ్యసనమైన సంభోగకాంక్షతో అతడెన్ని దోషాలు చేసినా ఇప్పుడు ధర్మపత్ని సంసారంతో "పాపబాహ్యుడు" కాగలిగాడు. సంసార సంబంధమైన సాంఘిక కథకు రుద్రకవిచూపిన పరిష్కార పర్యవసాన మిది. ఈ పరిష్కారంవల్లనే నిర్గంకుశోపాఖ్యానం నాకునచ్చిన కావ్యమూ. నేను మెచ్చిని కావ్యమూ.

తెలుగులోని యక్షగానాల్లో రుద్రకవి 'సుగ్రీవవిజయం' లాగే అష్టకాల్లో జనార్దనాష్టకంలాగే ప్రబంధాల్లో నిరంకుశోపాఖ్యానమూ ప్రశస్తమే. [ఆకాశవాణి విజయవాడ కేంద్రం వారి సౌజన్యంతో]

—0—

# "డాక్టర్ సి. ఆర్. రెడ్డిగారి ముసలమ్మ మరణము"

— ఎం. సీతారామయ్య, ఎం. ఏ.
తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్.

డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారి పేరు తలపునకు రాగానే మన స్మృతిపథమున తళుక్కున మెఱయునది ఆంధ్ర విశ్వకళా పరిషత్తు. కులము, మతము, ఉన్నవాడు లేనివాడు అను భేదములేక విజ్ఞానసుధల నందించు నీమహావ్యవస్థ స్థాపకుడావహానుభావుడే! ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ప్రప్రథమోపాధ్యక్షుడై ఆ సంస్థ సర్వతోముఖ వికాసమునకు అహర్నిశములు కృషిసల్పిన విద్యావేత్త యాతడు భారతదేశ మేధావులలో ఒకడు. ప్రాచ్య పాశ్చాత్య సాహితీ సిద్ధాంతములను ఆకళింపు చేసికొని తన జాతీయతను నిలుపుకొనిన అభిమానధనుడు; సాహితీద్రష్ట, స్రష్ట శ్రీ రెడ్డి మహోదయుడు.

ఈసాహితీపిపాస వీరితో వచ్చినది కాదు. సారస్వతాభిరుచి పారంపర్యముగా వచ్చిన వంశము వారిది. తాత తండ్రులు సంస్కృతాంధ్రాంగ్లములందు పండితులు. భారతమంతయు రెడ్డిగారి కించుమించు కంఠస్థమే అనవచ్చును. కవిత్రయముమీద్ర సమాన ప్రతిపత్తి యున్నను తిక్కనగారిమీద విశిష్టపక్షపాతము కలిగినవారు రెడ్డిగారు.

రామలింగారెడ్డిగారు ఆంధ్ర భాషాభిమాని. "మావంశమున కేది వచ్చినను రానిండు. తెనుగుభాష యొక్కటి యక్షయముగ నిలిచియుండిన చాలును" అని ఆంధ్ర భాషాభిమానము ఆంధ్ర విద్యార్థులకు కలిగించిన మహనీయమూర్తి డాక్టర్ రెడ్డిగారు.

ఆధునికాంధ్ర కావ్యనిర్మాతల పట్టికలో పద్దువేయించుకున్న డా॥ రెడ్డిగారి తొలికావ్యము "ముసలమ్మ మరణము." ఇది నవ్యకవిత్వ మహాప్రభాతమునకు భానూదయము కాదుగాని; తొలి ఉషోరేఖ. 20 వ శతాబ్ది తొలిదినములలో వికసించిన నవ్యభావ కవితా కుసుమములలో మేలైనది "ముసలమ్మ మరణము".

1899 లో మద్రాసు క్రైస్తవకళాశాలకు చెందిన 'ఆంధ్రభాషాభి రంజని' వారు నిర్వహించిన పోటీలలో ఉత్తమకావ్యముగా బహుమతిపొందిన దీ 'ముసలమ్మ మరణము' ఆ దినములలోనే మహామహోపాధ్యాయ వేదం వేంకటరాయశాస్త్రిగారి ఆశీస్సులు, ప్రోత్సాహము లభించినవి. ఆనాడే 'కవిత్వ తత్త్వవిచారము' నకు ప్రరోచన కలిగినది.

ముసలమ్మ మరణము 107 పద్యములుగల చిఱుకబ్బము. ఇందలి రసము కరుణము. కావ్యము మంగళాంతముగా ఉండవలెనన్న నియమము శాసనముగా ఉన్న ఆకాలములో విషాదాంతమైన సాంఘిక ఇతివృత్తమును ఎన్నుకొనుటయే నవ్యమార్గానికి సూచిక. దృశ్యకావ్యములలో ఈ మార్గమును త్రొక్కిన మొదటివారు ఆంధ్ర నాటక పితామహ ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు కాగా; కావ్యరచనలో విషాదాంతమును ప్రవేశపెట్టిన ఆధునికులలో ఆద్యులు కట్టమంచివారు.

ఈ కావ్యమునకు వస్తువు అనంతపురమండలములోని 'బుక్కరాయసముద్ర' మను గ్రామములో జరగిన సంఘటన. ఆ గ్రామమందలి చెఱువుకట్ట తెగిపోయినది. గ్రామమంతయు కొట్టుకొని పోవు ప్రమాదమేర్పడినది. 'బసిరెడ్డికి గల కోడలు ముసలమ్మను బలియిస్తే మీకేనుమంతయు కష్టముండ' దని ఆకాశవాణి పలికినది. 'సుదతీమణి, పూతచరిత' ముసలమ్మ అత్తమామలను ప్రాణప్రదుడైన భర్తను, వీడి 'జనులకు మేలొనరింపని తను వేలా?' అంటూ పసుపునను జలకమాడి, తలమీద చెట్లు కురిసిన లలిత సుమరాగమున వెలయు లతికయనునట్లు నీటమునిగి తాను మెట్టిన వూరిని రక్షించినది. ఆమె గాథ కరుణరస పూర్ణమైనది. కరుణరసభరితమైన 'ముసలమ్మ మరణము (1899)' గురజాడవారి 'పూర్ణమ్మ (1912)' వలె మనలను కంటతడి పెట్టించును. ముసలమ్మ సంఘశ్రేయమును కాంక్షించి ఆత్మార్పణ చేసికొన్నది. సాంఘిక దురాచారము పూర్ణమ్మను పొట్టను పెట్టుకున్నది.

'మనలో సాంఘిక కావ్యములు వ్రాసినవారు లేకపోలేదు. అయినను వానిని లోకకల్యాణప్రదముగా నిర్వహించినవారిలో రెడ్డియే ప్రథముడు. కాబట్టి గుణసంపదను బట్టికూడ ఈ కావ్యము గొప్పది.' — గో॥ వెంకటసుబ్బయ్య.

పందొమ్మిదేండ్ల యీడున రెడ్డి కవితాధార యెట్లుండెడిదో తెలిసికొనుటకు ఈ క్రిందిపద్యము గమనింపఁదగును.

చలదుత్తుంగ మహోగ్ర భంగపటలీ, సంఘట్టనారావము
జ్జ్వల కూలాగ్ర నటత్తుంగ రవమం,
చన్మధ్యభాగ్భ్రమిభృ
త్కూల సంపాతి మహోర్మికా నికరని,
ర్ఘోషంబునుం గూడఁగా
నలరున్ ఘోర సరస్సు దిగ్విదళన, వ్యాపార పారీణమై.

ఒక్కశైలిలోనేగాదు, సర్వకావ్య గుణములలో నిది కవి నూనూగు మీసాల వాడైనను ప్రౌఢుడని చాటునదిగా నున్నది.

కథాకథనముతోపాటు చక్కని వర్ణనలతోకూడినది యీ చిన్నికావ్యము-Poetry is Pointing- కవిత్వము వర్ణచిత్రము అను నిర్వచనమునకు సరితూగు శబ్దచిత్రమై ఆనందమును గొల్పుపద్యమును చూడుఁడు.

కన్నెఱ్ఱవారిన ఖర కరోదయు కాల
మల్లన మ్రింగు జాబిల్లి యనఁగ
జ్వల దగ్ని శిఖలపై నెలనవ్వుతోఁ బోవు
ధాత్రీ మహాదేవి తనయ యనఁగ
గెందామరల బారు సుందరమగు లీల
నల్లనల్లనఁ జొచ్చు నంచ యనఁగ
ప్రళయకాలానల ప్రభాభాసురోగ్ర
రంగదుత్తుంగ భంగ సంవ్రాతములకుఁ
గలఁక నొందక, దరహాసమలర మంద
మంద గతిఁ బోయి, చొచ్చె నమ్ముగుద నీట.

ప్రాచీనాంధ్ర కవులు స్త్రీల కచకుచములనే అధికముగా వర్ణించినారు. గ్రామీణ స్త్రీకి తగిన గౌరవము నియ్యలేదు. స్త్రీలోని సహజసౌకుమార్యమును, సౌశీల్యమును గ్రహించలేదు. అది గ్రహించిన రెడ్డిగారు ముసలమ్మను ఎంతమనోహరముగా చిత్రించినారో పరిశీలింపుడు.

లేఁగయై నాకుచు లీలమై మెడమలం
చిన గోవుఁ బిండెడు వనరుహాక్షి
బొండుమల్లెలతోఁట, బువ్వులు గోయుచు
వనలక్ష్మి యన నొప్పు వనజగంధి
బీదసాదల నెల్ల నాదరించుచుఁ గూడు
గడుపారఁ బెట్టెడు కన్నతల్లి
వ్యాధిబాధల నెవరైన నడల రెప్ప
వేయకుండఁగ గాచెడు వినుత చరిత
బిడ్డలెల్లరుఁ దమవారి విడిచిచేరఁ
జంక నిడికొని ముద్దాడు సదయహృదయ.

చిన్ననాటనే పాశ్చాత్యకావ్యపద్ధతుల మీద మోజు చూపించినారు రెడ్డిగారు. గ్రామజీవితమును ప్రకృతి వర్ణనములతో మేళవించినారు. ఈపద్ధతి పాశ్చాత్య కావ్యములలో ప్రత్యేకతనుపొంది ప్రశస్తిని అందుకొన్నది. అటువంటివర్ణన చేసి కావ్యమునకు నవ్యత చేకూర్చినాడీ బాలప్రౌఢకవి.

చెలికుఁ దోటలఁ జొచ్చి కొఱికి పాడొనరించి
దొరలట్టుపోవు పందులగణంబు
సెంద్రకాయల కొఱకే తెంచి గుంటిపై
మెక్కు-కూసెడు గుంటనక్కగములు
బడుగుబక్కలుగాక కడుపారఁ దిని పంది
గున్నలతోరాయు గొఱియపిండుఁ
బొలములలోఁ బచ్చికల మేసి చియ్యచే
నిగనిగలాడు గోనికరములును
కలకలారావములు మీఱఁగలిసి జొన్న
చేలపై వ్రాలు గువ్వల చెలువుఁ గలిగి
పైరుపచ్చల నొప్పు నాపల్లె, చెఱువు
నిండినీరంబు లొసఁగుచు నుండు నెపుడు

ఈవిధముగా సాగిన ముసలమ్మ మరణము ఖేదాంతము. మరణాంతము లన్నియు అమంగళముగా భావించుట అవివేకము. ఆమరణము లోకశ్రేయస్సు నిమిత్తము జరిగినదైనచో

( తరువాయి 7 వ పేజీలో )

# శ్రీ పురుషార్థ సుధానిధి శ్రీ

భూసుర మహిమ (ధర్మ స్కంధము)

మంత్రశ్రవణముచే శాపవిముక్తి నందిన వ్యాఘ్రము కథ — వ్యాధుడు సత్యతపు డను మహర్షియైన కథ.

రచయిత : శ్రీ సాయణాచార్యులు (సంస్కృతము)

శ్రీకృష్ణుండు చెప్పుచున్నాడు.

ధర్మమునకు బ్రాహ్మణుడు మూలము. ఆగమార్థములకు బ్రాహ్మణులే నిదానము. మనోవాక్కర్మలచే బ్రాహ్మణోత్తములుపూజనీయులు. బ్రాహ్మణులు సంతుష్టులైనచో నుత్తమపదము నొసంగఁగలరు.

బ్రాహ్మణుడు సర్వవర్ణములకుఁ బరమ గురుఁడు. అంతకంటె అధికుఁడు న భూతో న భవిష్యతి. బ్రాహ్మణుడు జాతి [పుట్టుక] మాత్రముననే దైవతములకును దైవతము. దేవతలు నిత్యము వీరివలననే కదా హవ్యముల ననుభవింతురు. పితరులు కవ్యముల నొందుదురు. విద్వాంసుఁడైనను విద్యాహీనుడైనను బ్రాహ్మణుడుత్తమ దైవతము. అగ్ని సమానుడు. సమస్త ప్రాణులకు వధింపరానివాడు.

విప్రులు నాకుఁ బరమగతియైనవారు. అస్మత్ స్వరూపులే బ్రాహ్మణులు. నరు లనేకులు జ్ఞానహీనులై యీ సంగతి గ్రహింప లేకున్నారు. నేనే యీ పుడమియందు బ్రాహ్మణరూపమున వర్తించుచుంటిని. బ్రాహ్మణుని కంటెఁ బవిత్రమైనదియుఁ, బుణ్యప్రదమైనదియు, వస్తువు మఱొకటిలేదు. సతతము భక్తితో బ్రాహ్మణులను పూజింపవలయును. బ్రాహ్మణునిఁ బూజించిన నిస్సంశయముగా నన్నుఁ బూజించినట్లే. బ్రాహ్మణుని సత్కరించి మహాపదవి నొందవచ్చును. అట్లు పొందినవా రనేకులు కలరు.

పూర్వ కల్పమున ఆరుణి యను నొక బ్రాహ్మణ ఋషిగలఁడు. ఆత డొకప్పు డరణ్యమునకుఁ బోయి, రమ్యమైన దేవికా నదీ తీరమున నుపవాస పరాయణుఁడై తప మొనరించుచుండెను. ఒకనాడు నదిలోనికిఁ బోయి స్నానమొనరించి యెదుట నొక వేట గానిని జూచెను. ఆవ్యాధుఁడు గొప్పవిల్లు చేతఁ బూని యెఱ్ఱని కనులుగలిగి భయంకరముగా నుండెను. వల్కలముల నపహరించుటకై యాతఁ డాబ్రాహ్మణుని జంపుటకు వచ్చెను.

ఆ బ్రాహ్మణుఁ డావ్యాధునిఁ జూచి, భయపీడితుఁడై నారాయణుని మనసున ధ్యానించుచు నచటనే యుండెను. అట్టి స్థితిలోని బ్రాహ్మణునిఁ జూచి భయపడిన వానివలె వ్యాధుడు విల్లమ్ములు నేలఁ బడవైచి, యీ విధమునఁ బలికెను.

"ఓ బ్రాహ్మణుఁడా! ఇంతకు ముందు నిన్నుఁ జంపఁదలఁచి యిచటికి వచ్చితిని. ఇపుడు నీ దర్శనము వలన నా బుద్ధి మారిపోయినది. వేల కొలది పురుషులను నంతకుఁ బదిరెట్లు స్త్రీలను జంపితిని. కుటుంబ పోషణకై నావృత్తి ననుసరించి యిల్లెంత చేసినను నెపుడును నధికమైన ధనము నాకు దొరకలేదు. ఇపుడు నీ సమీపమున నుండి తపస్సు చేయ గోరుచున్నాను. నాకు నదుప దేశ మొనరించి, నన్నను గ్రహింపుము." ఈతఁడు పాప కర్ముఁడు బ్రాహ్మణ హంతకుఁడు, నని తలచి; ఆరుణి యావ్యాధునకేమియు సమాధానము పలుకలేదు. అయినను నావ్యాధుఁడు తపోనిరతుఁడై ఆ బ్రాహ్మణుని యాశ్రమమున

నొక వృక్షమూలము నాశ్రయించియుండెను. అట్లు కొంత కాలము గడచిన పిమ్మట నావిప్రు డొకనాఁడు నదికిఁ బోయెను. అపుడొక యాకలి గొన్నపులి బ్రాహ్మణునిఁ జంపుటకు సంసిద్ధ మయ్యెను. నీటిలో నున్న యా బ్రాహ్మణునిఁ బట్టుకొను లోపల వ్యాధుఁ డావ్యాఘ్రమును గొట్టి చంపెను. నీటిలోని బ్రాహ్మణుఁ డాసవ్వడి విని కలతచెంది 'నమో నారాయణాయ' యను వాక్యమును గట్టిగా నుచ్చరించెను. కంఠగత ప్రాణమైయున్న వ్యాఘ్రము 'నమో నారా యణాయ' అను మంత్ర వాక్యమును వినెను. అంతట వ్యాఘ్ర శరీరము నుండి యొక పురుషుఁడు వెలువడి "ఓ బ్రాహ్మణుఁడా! నీ యనుగ్రహ మున నా పాపములు నశించినవి. సనాతనుఁడైన విష్ణుమూర్తి పదమునకుఁ బోవు చుంటిని." అని పలికెను.

ఓ పురుషశ్రేష్ఠుఁడా! నీ వెవరవు? అని బ్రాహ్మణుఁడడుగఁగా; నాత డిట్లు చెప్పెను.

"దీర్ఘబాహుఁడని ప్రసిద్ధిగన్న రాజ శ్రేష్ఠుఁడను. వేదార్థములనుగాని, శుభా శుభ ములనుగాని, నేనెఱుఁగను. "బ్రాహ్మణులతో నాకుఁ బనిలేదు. బ్రాహ్మణులనేమో నాకుఁ దెలియదు." అని వాదించు నాపైఁ గోపము పూని బ్రాహ్మణులందఱు 'క్రూరమైన వ్యాఘ్ర మవుక' మ్మని తిరుగులేని శాప మొసఁగిరి. నమ స్కరించి యా బ్రాహ్మణు లందఱను ప్రసన్నులను జేసికొంటిని.

"బాణ ఘాతమునొంది కంఠగత ప్రాణుఁ డవైయుండి యొక బ్రాహ్మణోత్తముని వలన నమో నారాయణ మంత్రము వినఁగానే శాపము తొలగి నీకు స్వర్గము తప్పక లభింపఁగలదు." అని వారు పలికిరి.

'బ్రాహ్మణద్వేష ఫలితము ననుభవించి ని. నీదర్శనము వలన సుఖవంతుఁడవైతిని' అని బదులు పలికి యా పురుషుడు మాత్సర్యము వీడి స్వర్గము నొందెను.

బ్రాహ్మణుడును సంతోషించినవాఁడై 'ఇపుడు నీ పాపములు దేవికా స్నానము చేతను, నాదర్శనము చేతను, నాచిర శుశ్రూష చేతను, నశించి అసంశయముగాఁ బరిశుద్ధ దేహుఁడవైతివి. నా సన్నిధి 'యందునియమస్థితుఁడవై తప మొన రింపుము.' అని యావ్యాధున కారుణివర మొసఁ గెను. అట్లు వర మొంది యావ్యాధుఁడు బ్రాహ్మణ భక్తుఁడై యాఋషినే మనసున స్మరించుకొనుచు నిరాహారుండై తపమొనరించెను. కొంత కాల మట్లు జరగిన తరువాత నా ఋషి వ్యాధు ననుగ్రహిం చెను. ఆకలికి లోనై యెముకలు మాత్రము మిగిలి బలహీనుఁడై యున్న యా వ్యాధునిఁ జూచి "సమస్త శాస్త్రములు, వేదములు, సంగ్రహ ములు, బ్రహ్మవిద్య, పురాణములు, ఇతిహాస ములు; సంపూర్ణముగా నిత్యము నీకు గోచరించు నుగాక. నీవు సత్యతపుఁ డను పేరుగల యుత్తమ ఋషివి కాగలవు." అని యా వ్యాధున కారుణి వర మొసఁగెను. అట్లు వర మొంది యావ్యాధుఁడు ధన్యుఁడయ్యెను. బ్రాహ్మణానుగ్రహమున సాధ్యము కాని దేదియు లేదు – పూజితులైన బ్రాహ్మణులు సర్వసిద్ధిప్రదాయకులు–గావున వారు పూజనీయులు. (మహాభారతము.)

తెలుగు రచన : సంపాదకుఁడు.

---

( 5 వ పేజీ తరువాయి )

అది మంగళమే. అట్టిదానితో అంతమైన కావ్యమును మంగ ళమే. ముసలమ్మ గ్రామశ్రేయస్సునకై ప్రాణత్యాగముచేసిన వీరవనిత. ఆమె ప్రాణత్యాగము చేతనే గ్రామప్రజలకు క్షేమము చేకూరినది. కనుక ఈకావ్యము మంగళాంతమే. ఈ ధర్మ సూక్ష్మమును గ్రహించి కళాధర్మమును ఎరిగి, కథకు పరిణామమును కలిగించి, ఆంధ్ర కావ్య సరణిలో ఆధునికత్వ మును తెచ్చినవారు శ్రీ రెడ్డిగారు.

ఈ ఖండకావ్యము ద్వారమున కట్టమంచి వారి సాహితీ వ్యక్తిత్వమును గ్రహించగలము.

# భగవద్గీత - దైనికజీవితము

— శ్రీమతి యన్. రమాదేవి, బి. ఏ., బి. యిడి.

## త్రిగుణములు - వాటి ప్రభావము

భగవానుని కిష్టమైనట్లు మనం నడచుకోవాలంటే — ముందుగా మనలోనున్న గుణాలేమిటి? ఆగుణాలకి లొంగి మనం ఏయే పనులు చేస్తున్నాం? ఆచేసే పనుల వల్ల ఎలాంటి ఫలితములు వస్తున్నాయి? మనకి భగవత్ సాక్షాత్కారం కలగాలంటే మనలోఎటువంటి గుణాలను వృద్ధి పొందించుకోవాలి? అనే విషయములను గూర్చి తెలుసుకోవాలి.

సర్వతః పాణిపాదం తత్
త్సర్వతోఽక్షి శిరో ముఖమ్
సర్వతః శ్రుతిమల్లోకే
సర్వ మావృత్య తిష్ఠతి॥
(అ 13 శ్లో 14)

"పరమాత్మ లోకములో అంతటను కాళ్ళు, కళ్లు, ముఖములు, చేతులు, చెవులు కలిగి వ్యాపించి యున్నాడు." అని శ్రీకృష్ణపరమాత్మ వచించి యున్నాడు. లోకములో అంతటను కాళ్ళు, కండ్లు, చేతులు, వ్యాపించియుండట మేమిటి? అని అనుకుంటాం మనం, కానీ దీని అర్థం వేరు. ఈ సృష్టిలోనున్న జీవరాసుల యొక్క చూడగలిగేశక్తి, నడిచేశక్తి, మాటలాడగలిగేశక్తి అదీ ఇదీ అనిలేదు; మనంచేసే ప్రతి పని పరమాత్మయొక్క పరాశక్తి వల్లనేకదా చేస్తున్నాం. మనయొక్క ఇంద్రియములు కేవలము పరికరములు. ఉదాహరణమునకు చెవులు అందంగా బాగా ఉంటాయి. కానీ వారికి వినపడదు. కండ్లు అందంగా ఉండి కనిపించనివారు ఉన్నారు. దీనినిబట్టి మనం తెలుసుకొనేదేమిటంటే ఈ ఇంద్రియములు కేవలము పరికరములని అసలు చూడగలిగే శక్తి-వేరే ఉన్నదని తెలుసుకోవాలి. దీనినే కృష్ణపరమాత్మ ఇట్లు చెప్పుచున్నాడు—

ఈశ్వర స్సర్వభూతానాం,
హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని
యంత్రారూఢాని మాయయా
(అ 18-శ్లో 61)

"శరీర మనెడి యంత్రము నధిష్ఠించి సమస్తప్రాణులను తనయొక్క మాయ చేత వారివారి పూర్వజన్మకర్మల ననుసరించి నడిపించుచు వారి హృదయాంతర్వర్తియై యున్నాడు." అందువలననే ఆపరమాత్మయొక్క శక్తి మనలో నున్నంత వరకే మన అవయవములు పనిచేస్తాయి. లేనినాడు పనిచేయలేవు. చూపు బాగా ఉన్నన్నిరోజులు దానియొక్క విలువ తెలియదు. అంధత్వముకాని బధిరత్వముగాని వచ్చిననాడు వాటియొక్క శక్తి మనకి అర్థమౌతుంది. కారులో పెట్రోలున్నంత వరకూ మనం ప్రయాణం చెయ్యగలం. పెట్రోలు అయిపోగానే కారు ఆగిపోతుంది. కారు నడవడానికి పెట్రోలెంత అవసరమో ఈ సృష్టిలో సర్వక్షేత్రములు పనిచేయటానికి భగవంతునిశక్తి అంతే అవసరం.

అందరిశక్తి భగవానునిదే! అంటున్నాం కదా. సృష్టిలో ఎన్నో భేదాలను మనం చూస్తున్నాం. చెట్లు-జంతువులు-కీటకాలు-మానవులు మొదలైనవి. ఒక జాతికిచెందినవాటిలోనే అనేక భేదములు కనిపిస్తున్నాయి. ఒకకుక్క మంచి తెలివి కలిగి వాసనచూచి దొంగలు ఎక్కడెక్కడ తిరిగి దాక్కున్నారో తెలుసుకోగలదు. కొన్ని కుక్కలు వీధులలో పెంటకుప్పలపై తిరుగుతూ అమేధ్యమును తింటూ జీవిస్తాయి. ఒక చెట్టు జామపండు తీయగా ఉంటుంది. ఇంకో చెట్టు పండు చప్పగా ఉంటుంది. ఒకమనిషి మంచి తెలివి తేటలతో ప్రకాశిస్తూంటాడు. ఇంకొకడు మందమతిగా ఉంటాడు. ఇంకొకడు దోపిడీలు హత్యలు చేస్తూంటాడు. ఏమిటీ భిన్నత్వం? అన్నింటినీ సృష్టించినదీ నడిపించేదీ ఒకేశక్తి? ఏమిటీ సృష్టివైపరీత్యం?

ఒక చెంబెడునీళ్ళు తీసుకుని రంగు రంగుల సీసాలలో పోస్తే— ఎఱ్ఱ సీసాలో నీళ్ళు ఎఱ్ఱగాను, పచ్చ సీసాలో నీళ్ళు పచ్చగాను — నీలంసీసాలోనీళ్ళు నీలంగాను కనిపిస్తాయి. అన్నిసీసాలలో నీరు ఒక్కటే కానీ సీసాలు తయారైన పదార్థములు వేరు. ఏరంగుగాజుతో సీసా తయారైందో ఆరంగు ఈ నీళ్ళపై ప్రతిఫలించి నీళ్ళరంగే మారిపోయినట్లు భ్రమ కలుగుతుంది. అలాగే సృష్టిలో అంతటను భగవంతుని శక్తే ఉన్నప్పటికీ వారి వారి పూర్వజన్మ సంస్కృతి వల్ల కలిగిన సత్త్వ-రజ-స్తమములనే మూడు గుణములవలన ఈ భిన్నత్వం ఏర్పడింది.

ఈగుణములకెంత శక్తి ఉన్నదంటే-ప్రతిఒక్కరి మనస్సు ఈ గుణములకు లొంగిపోయి తనలోని భగవత్ శక్తిని కూడా గుర్తించలేక (ఆత్మజ్ఞానము) ఈ గుణములు ఎలానడిస్తే అలానడుస్తుంది. ఈ మూడు గుణములు ప్రతిఒక్కరిలోనూ ఎప్పుడూ ఉంటాయి.

న తదస్తి పృథివ్యాం వా,
దివి దేవేషు వా పునః
సత్త్వప్రకృతిజై ర్ముక్తం,
యదేభి స్యాత్త్రిభి ర్గుణైః।
(అ 13— శ్లో 49

ప్రకృతి సిద్ధమైన సాత్విక రాజసిక తామసిక గుణ రహితమైన ప్రాణి భూలోకములోకానీ, దేవలోకములో ఏ దేవతా గానీ లేదు" అని భగవానుడు చెప్పినాడు.

సీసారంగు నీటిపై ప్రతిఫలించి నీటి రంగునే ఎలామార్చివేసిందో అలాగే ఈ త్రిగుణములు భగవంతుని శక్తిపై (ఆత్మ జ్ఞానము) ప్రతిఫలించి సృష్టిలోనే భిన్నత్వాన్ని తీసుకు వచ్చాయి. ప్రకృతివలన పుట్టిన ఈ సత్త్వరజస్తమము లనే గుణములు నాశరహితుడైన ఆత్మను దేహములో బంధించి వేస్తున్నాయి. ఈ త్రిగుణములపై యుద్ధముచేసి మూడింటినీ జయించిన వారికి పరమాత్మయొక్క వెలుగు కనిపిస్తుంది. ఆత్మజ్ఞానము కలుగుతుంది. చీకటి మయమై పోయిన జీవన మార్గము దేదీప్యమానమై ప్రకాశిస్తుంది.

ఈ గుణములలో మొదటిది సత్త్వగుణము. ఇది ప్రకాశవంతమైనది. సుఖము-జ్ఞానము కలిగిస్తుంది.

రజోగుణము దృశ్య విషయములందు కోరికను కలుగజేస్తుంది. నేను — నాది, అనే భావము, ఇది కావాలి — అది కావాలి అనే కోరిక — బాధలు — దుఃఖాలు — కష్టాలు కలుగజేస్తుంది.

తమోగుణము జీవులలో సోమరితనము — మఱపు — చిరాకు — నిద్ర — అజ్ఞానము — అవివేకము కలుగజేస్తుంది.

ఈమూడు గుణములు ప్రతిఒక్కరిలోనూ ఎప్పుడూ ఉన్నాయి. కానీ అందరిలో ఒకే పాళ్ళలో లేవు.

సత్త్వగుణం ఎక్కువున్నవారు మంచి తెలివితేటలతో ప్రకాశిస్తూ జీవితంలో సుఖాలని అనుభవిస్తూంటారు. వీరు పైకి పైకి వెడుతూంటారు. క్రొత్త క్రొత్త జ్ఞాన విషయాలు - సృష్టిరహస్యాలు — వాళ్ళ మేధ చేత కని పెడుతూంటారు. వారి కదే ఆనందం. అదే జీవితం వీరిలో రజస్తమములు అణగి ఉంటాయి. అహం భావము — సోమరి తనమూ ఉండవు. వీరే న్యూటన్, సర్. సి. వి రామన్, విశ్వేశ్వరయ్య, జగదీశ్ చంద్రబోస్, టెంసింగ్, మార్కో మొదలైనవారు. ఇంకా త్యాగరాజు, రామదాసు మొదలైన గాయకులు, కవులు, శిల్పులు, వైద్య విజ్ఞాన పరిశోధకులు, మొదలైన వారు.

రాజసులు- వీరు లోభులు. చెడ్డపనులు చేస్తూ ధనార్జనే ముఖ్యలక్ష్యంగా పెట్టుకుంటారు. భౌతికమైన కోరికలను తీర్చుకోనటమే వారి ముఖ్య లక్ష్యము. వారు వారి కోరికలు తీరినవేళ సంతోషపడుతూ తీరని వేళ దుఃఖిస్తూంటారు. వీరినిఎప్పుడూ ఏదో ఒకటి కావాలనే కోరిక వెంటాడుతూంటుంది. ఇంద్రియ నిగ్రహముండదు. వీరిలో సాత్విక తామసము లణగద్రొక్కబడి ఉంటాయి. ఇటువంటి వారిని మనము చాలమందిని చూస్తున్నాము. చరిత్రలో పురాణములలో కూడా ఇటువంటి వారిని గూర్చి చదువుకున్నాము. కాబట్టి ప్రత్యేకముగా వ్రాయనవసరములేదు.

బద్ధకంగా నిద్రపోతూ అజ్ఞానంతో ఎవరుంటారో వారు తామసులు-వీరిలో సాత్త్విక రాజసము లుండవు.

సాత్త్వికులు నిర్మలమైన సుఖాన్ని, రాజసులు దుఃఖాన్ని తామసులు అజ్ఞానాన్ని అనుభవిస్తూంటారు. ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా, మధ్యే తిష్ఠంతి రాజసాః; జఘన్య గుణ వృత్తిస్థా, అధో గచ్ఛన్తి తామసాః॥

(అ 14—శ్లో 18)

సాత్త్వికులు పైపైకి వెడతారు. రాజసులు ఎక్కడ ఉన్నవారక్కడే ఉంటారు. తామసులు అథోగతిపాలౌతారు.

సాత్త్వికుడైన విద్యార్థి తేజస్సుతో మంచి తెలివితేటలతో తరగతిలో చెప్పే పాఠాలను శ్రద్ధగా విని అర్థం చేసుకుని మొదటివాడుగా నిలబడి ఉన్నత విద్యల నభ్యసించి పైకి వెడతాడు.

రాజసుడైన విద్యార్థి కోరికలతో సతమతమౌతూ చదువునందు శ్రద్ధ చూపలేక చివరికి కష్టపడి ఎలాగోలాగ పరీక్షలలో నెగ్గుకువస్తాడు.

తామసుడు సోమరితనం చేత, అశ్రద్ధ చేత, అతినిద్ర చేత ఉన్న తరగతినుండి పైకి వెళ్ళలేక జీవితాన్ని చీకటిమయం చేసుకుంటాడు.

అలాగే ఒక ఉద్యోగి-తన ఉద్యోగానికి సంబంధించి పరీక్షల నన్నింటిని చదివి ఉత్తీర్ణుడై పెద్ద ఉద్యోగిగా వెళ్ళగలడు. ఇతడు సాత్త్వికుడు.

రాజసుడు కోరికలతో నిండి పరీక్షలకు చదవలేక ఉన్న ఉద్యోగంలోనే ఉంటాడు. తామసుడు నిద్రబద్ధకం— అవివేకం - అజ్ఞానం చేత పని సరిగా చేయలేక ఒక్కొక్క సమయంలో ఉద్యోగాన్ని కూడా పోగొట్టుకుంటాడు.

అలాగే అధ్యాత్మ రంగంలో సాత్త్వికులు స్వర్గానికి దగ్గరగా వెళ్ళగలుగుతారు. రాజసులు ఈ మానవలోకంలోనే తిరిగి తిరిగి జన్మించి బాధలు పడతారు. తామసులు-తెలివిలేని తక్కువ జన్మల లోనికి పోతారు. పశు పక్ష్యాది జన్మలు వస్తాయి.

మనలో మనం బాగా ఆలోచించుకుంటే మన మనస్సు భగవానుడు చెప్పిన ఈ మూడు గుణాలలో ఏ గుణానికి లొంగి ఉందో తెలుస్తుంది. సత్త్వగుణం ఉంటే అందరికీ బాగానే ఉంటుంది. రాజస తామసములు మనలను పరిపాలిస్తూంటే వాటికి మనం లొంగిపోవలసినదేనా? లేక వాటిని జయించ గలమా? ప్రయత్నము చేత నిరంతర సాధన చేత సాత్త్వికులము కాగలమా?

రాజస తామసము లనేవి నిజంగా రెండు రకాలైన మానసిక వ్యాధులు. ఈనాడు ప్రపంచములోని ప్రజలలో చాలమందిని పట్టుకుని పీడిస్తున్నాయి. రాజస తామసములే కాకుండా సాత్త్వికము కూడా మానవుని జీవిత ప్రయాణ

ములో ఆటంకములను కలుగ జేస్తుం దని భగవానుడు చెప్పియున్నాడు.

సాత్త్వికము చాలా ప్రకాశవంతమైన దికదా? అది జీవిత ప్రయాణములో అడ్డు ఎలా అవుతుందని మన కనుమానం కలగ వచ్చును. ఒక తెల్లటి గుడ్డను ముక్కలుగా చేసి-ఒకముక్కను కాంతివంతమైన బంగారు రంగులో ముంచితే-బంగారు వన్నెతో మెరుస్తుంది. ఎఱ్ఱరంగులో ముంచితే ఎఱ్ఱగా ఉంటుంది. నల్ల రంగులో ముంచితే నల్లగా ఉంటుంది. ప్రకాశవంతంగా మెరుస్తున్నప్పటికీ బంగారు రంగు కూడా తెల్లని వస్త్రానికి పూతయే కదా? అన్నింటినీ తిరిగి బ్లీచ్ చేసి వేస్తే అన్నీ తెల్లగా అవుతాయి.

అలాగే మనలోనున్న ఆత్మజ్ఞానానికి అడ్డుగా నిలచిన సాత్త్వికమనే పూతను కూడా తుడిచివేసి సాత్త్విక స్థితి కంటె కూడా ఇంకా పైస్థితి (అంటే ఆత్మస్థితి) కి వెళ్ళితద్వారా పరమాత్మ స్థానాన్ని ఎలా చేరుకోవాలో భగవానుడు చెప్పినాడు. పరమాత్మకు మనపై ఎంతకరుణ? సాత్త్విక గుణానికి కూడా అతీతులమైతే ఇంక మనం ఎలాఉంటామో తలచుకుంటూంటే వళ్ళు పులకరిస్తుంది.

సాత్త్విక రాజస తామసములనే ఈ గుణములు మూడూ మూడు రకములైన మానసిక వ్యాధులు. మానసిక వ్యాధులను కుదిర్చే వైద్యునిలాగ కృష్ణ పరమాత్మ మనకు మంచి సలహాల నిచ్చియున్నాడు. వైద్య పరీక్ష చేసుకోటం ఎలాగో చెప్పి, పరీక్షించుకొని వ్యాధి నిర్ధారణ చేసుకున్నాక వ్యాధిని పూర్తిగా నిర్మూలించుకోగలిగే ఉపాయములను కూడా చెప్పియున్నాడు. కానీ ఫలితమంతా మన ప్రయత్నం మీద ఆధారపడిఉంది. త్రిగుణాతీతులము కావటం ఎలాగో ముందు తెలుసుకుందాము.

( సశేషం )

— 0—

# గ్రంథ సమాలోచన

## "పద్ధెనిమిది ఖండాల్లో ప్రసరించిన కవితాత్మక మానవత"

### డా॥ సి. నారాయణరెడ్డిగారి భూమిక కావ్యం.

కర్పూర వసంత రాయలు, నాగార్జున సాగరము, అక్షరాల గవాక్షాలు, జాతిరత్నం, విశ్వనాథనాయుడు, రామప్పగుడి వంటి కావ్యములు, 'ఆధునికాంధ్ర కవిత్వము-ఒక పరిశీలన' అనే పరిశోధన గ్రంథము, వ్రాసి; చలనచిత్ర రంగమున పుంఖాను పుంఖముగ పాటలను వ్రాసి; ఆంధ్ర దేశమున లబ్ధప్రతిష్ఠులైన డా. సి నారాయణ రెడ్డిగారి నూతన గ్రంథం ఈ భూమిక.

ఈ కావ్యమున The Evolution of the poetry ని తెరలు తెరలుగా దర్శింప జేయుటలో జాతీయ అంతర్జాతీయ దృక్పథములు మేళవింపబడినవి. నారాయణ రెడ్డిగారి లోగడ కబ్బములకును దీనికిని బహిర్వ్యాఖ్యతము కాని ఒక అంతరమేదియో వున్న దనిపించినది. క్రొత్తదనముగల గ్రంథమిది. వేల యేళ్ళనుండి భారతసంస్కృతి నవనాడులలో ప్రవహిస్తున్న వేద కవితనుగూర్చి.

ఎప్పటిది ఆ సన్మహూర్తం?
ఎక్కడిది ఆ రెక్కలెత్తిన
బుక్కవిత? ఏ
జటలలో పుట్టిందో? అగ్ని
చ్ఛటలలో పుట్టిందో? యేమో?
అది అనాది; అపౌరుషేయం
అవిజ్ఞేయం; అనుభవీయం
జానపద మది జ్ఞానపథ మది
పరమమైన రసాత్మతరువున
పండిరాలిన భవ్యఫల మది
అక్షరాక్షర మెంతదీప్తిని
కుక్షిలోపల దాచుకుందో?
అనుపదం ఎంతెంత శక్తిని
ఆత్మలోపల పొదుగుకుందో?
లేకపోతే ఇన్ని ఓజో
రేఖలా పొడిమాటలకు?
కాకపోతే ఇంత జీవో
త్సేకమా విడి బంతులకు?
హృదయలయలో ఉచ్ఛ్వసించిన
ఇడాతంత్రుల నిశ్వసించిన
ఋక్కులే రసగంధ పౌరుష
వాక్కులై మన్వంతరాలకు
అందసాగెను పౌరసంగా,
అక్షర ప్రతిభాస్పృశంగా

అంటారు. జాతీయ భావరహితులైన వారికి వెగటుగా కనిపించెడి అమృత వాక్యము లివి.

రామాయణ కవితాత్మ గురించి వ్రాయుచు

"ఎన్ని పక్షులు కలుసుకోవు;
ఎంత మోహం ఒలికి పోదు;
ఎందరు కిరాతకులు లేరు;
ఎన్ని హింసలు జరుగలేదు;
క్రౌంచ పిట్టలలోన ఒకటి,
కూల్చినాడంట ఆకటికి,
అది చూచి అయ్యోనా ఋషి?
అప్పుడే మొలిచెనా శేముషి?"

అంటూ -

"కాదు కాదీఘటన యాదృచ్ఛికం
ఆదికవి సంసృష్టి కది ప్రేరకం॥
అంటారు.

భగవద్గీత కవితను గూర్చి—

ఇలాతలమే ప్రమిదగా వెలి
గింపజేసిన విశ్వదీపం 'అని
దీపారాధన చేయుచు
ఒరసి చూస్తే పసిడిగీతలు
తరచి చూస్తే కడలిలోతులు

ఎగసి చూస్తే ద్యోజగత్తులు
స్థగితమయ్యే జగాయెత్తులు

దారి తప్పని ధర్మనీతికి, అవధిదాటని అర్థనీతికి, కన్నుగప్పని కామనీతికి, పక్ష మెరుగని మోక్షనీతికి

ఎన్ని భాష్యాలల్లుకున్న కవిత్వ మది
ఎన్ని ప్రతిభలు మలచుకున్న గురుత్వ మది

అంటూ ఒక ఆలోచనా జనిత తన్మయత్వముతో వ్రాసిన కవిత యిది.

నేడు భవిష్యపథము నుండి తిరోగమనము చూపని అర్ష గ్రంథముల పట్ల కూడా వైముఖ్యమును ప్రదర్శించు మహానుభావు లెందరో! కాళ్ళ బలము లేకుండగనే పరుగులెత్తు దృక్పథము వారిది. నారాయణరెడ్డిగారు బాటసారులు కారు. కవికి సత్య వీక్షణము ఆవశ్యకమని భావించిన వారాయె. రాద్ధాంతములు చేయకుండగనే సిద్ధాంతములు గలిగిన సి. నా. రె వంటివారు పలువురుండిన తెలుగు కవితకు ఎంతో యుపయోగము.

పరిణామ శీలమైన ప్రకృతితత్త్వమును గీతా కవితగా వ్రాసిరి. అంతేకాదు గీత ప్రభావమును గూర్చి—

"విపుల వాఙ్మయ పుష్కరిణు లవి
ఎపుడు ఇంకని నీరనిధు లవి
వాటి అవిరి తీరిచిన కా
వ్యాల జలధరమాల లెన్నో"
అంటారు.

ఈ భూమికలో హృదయ పూర్వకముగ ప్రతి ఖండికను అనుభూతికి దెచ్చుకొన్న-ఒక మహా కావ్య సమీపమున నున్నట్లుగాని, ఒక మహా కాలమున నివసించు చున్నట్లు గాని యనిపించును.

కాళిదాసుని మేఘసందేశాత్మక కవితను గూర్చి వ్రాయుచు,

"ధూమ సలిల మరుదాది
స్తోమమైన మేఘానికి
ఎప్పుడు అలవడినది ఆ చైతన్యం
ఎక్కడ నేర్చినదో ఆ సౌజన్యం-అని

మానవ సహజముగ ప్రశ్నించుకొనుచు -

'అది అనంత రస నితాంత గురుమనీష
ఆపలుకే ధ్వన్యర్థ్యగ కావ్యభాష"
అనిరి.

పోతనను గూర్చి వ్రాయుటలో ప్రారంభము కవితా మహత్తును తెలుపునట్టిది.

"తేనెలో ఎన్నాళ్ళు నానినా
తెలుగు కంతటి తీపి యెక్కడిది
తెలుపనా అది వాని(పోతన)పుక్కిటిది
ఏమి గతి మాధురి ఆదేమి శైలీ లహరి
ఎందు కాతడుగ జన్మించనైతిని హరీ!

అని వ్రాయుటలో ——తాను పోతనగా పుట్టి యుండిన నెంత బాగుండును? అనుకొనుట పోత పోసిన అభిమానమునకు సాక్షి అయినట్టిది. అర్థశబ్ద సౌందర్యముతో-అంత్య ప్రాసల విన్యాసాలతో, లయల సొగసులతో కవిత్వము చెప్పు శ్రీ రెడ్డిగారట్లు అనుకొనుట అయుక్తము కాదు.

ఆరునొక-ఖండిక వేమనను గూర్చి సామాన్య ధోరణిలో నడిచినది.

"చెప్పినది చిటి పద్యజాలం
విప్పినది విశ్వాంత రాళం"

అను రెండు ముక్కలు వేమన నోటి మాటలుగా వచ్చినవి. మిగిలినవి వేమన పద్యస్ఫురణస్ఫూర్తి నిచ్చునవి.

ఎనిమిదవ ఖండికలో శ్రీ సి. నా. రె విశ్వావలోకనము చేసి 'అంతా కవితామయమేనోయ్' అనుదానిని కళ్ళకుకట్టి చూపారు? దీనిలో సృష్టికర్త ఊహాతే కవితలంటారు. సూర్యుని చేతుల్లోని కాంతి కవిత, చీకటిలో ఆకాశం వాకిటిలో రజని రమణి రచియించిన ముగ్గుల్లో రవల కవిత ధవళకవిత, ఈ విధముగా ప్రవహిస్తున్న కవిత ప్రతిమానవ మాతృ భాష అంటారు.

'నవ'కవిత ఒక నవకవిత. నిరంతర భ్రమణ శీలమైన పుడమి చెప్పిన స్వీయ విషయములలో

"విభావరీ ప్రభాతాల
విరతి లేని చంక్రమణం-ఎందుకనిన

ఎన్నడో ఒక మహాగ్ని గోళానికి శకలంగా తాను విడిపోయినది. ఎప్పటికైనను మాతృ గోళ మందు కొనుటకే-చల్లని మమకారంతో చుట్టు తిరుగుతున్నది.

10వ కవిత నుండి మార్క్సు ప్రభావం ప్రపంచంపై పడిన సంగతి, విశ్వవ్యాప్త సంచలనము, భారత దేశముపై ప్రభావము, భారత స్వాతంత్ర్య సంపాదనము- ఈ విధమయిన బహువిషయములు, గాంధీ, సోక్రటీసు, క్రీస్తు ప్రభృతుల త్యాగబుద్ధులు, పరోపకార గ్రహములు, ఎన్నియో కన్నులం గట్టును.

ఈ భూమిక ఒక ఆరిపోని పరిణామ జ్యోతి. చైతన్యము ఆకృతిగా మనిషై పల్లవిగా సాగిన అఖండ కవిత.

భావాను గుణముగా శబ్దములను రస మార్గములో నడిపించుట శ్రీ సి. నా. రె. కి నల్లేరుపై బండి నడక అని మరి ఒక మారు వ్యక్తమయినది.

తన పూర్వ కవులను గౌరవించుకొనుట, సమకాలిక మహాకవుల కావ్య గుణ సమాదరణము, వంటి సుగుణములు గలిగి అభ్యుదయ కవియైన శ్రీ రెడ్డిగారి ఈ భూమికకు ప్రతి తెలుగు వాని హృదయమున స్థానముండ దగినది. ఆకాశమున నక్షత్రములను చూచుట కిష్టపడుచు, భూమి మీద నిలబడుట కిష్టము లేని వారికి తప్ప అందఱకు రుచించ దగిన కవితా సమాహార మది. ఇది పూర్తిగా నారాయణరెడ్డి గారి గొంతుక తోరికార్డయి శ్రవణ ద్వార ప్రవేశము చేసినచో తెలుగులకు ఒక వెలుగు.

ఈ నాడు విప్లవ రచయితలు కొందఱు జానపద రీతులలో పాటలు వ్రాయుట ప్రశంసనీయము. కారణము ఒక లయపై ప్రయాణము త్వరితముగా చేసి మానవుని హృదయమును సమీపించు గుణము ఆ కవితకు కలదు.

నారాయణరెడ్డిగారి రచన భావములను లయము చేయని లయగలిగి నట్టిది. పలుపోకడలు పోయినది కవితా విశ్వరూప సందర్శనము చేయించినది. మానవతాత్మక కవితల వెలయించినది.

— శ్రీసన్నిధానం

# చమత్కార మంజరి

సేకరణ : యస్. రాజశేఖర్ (రత్నశ్రీ) బి. ఏ.

హాస్యం జీవితాని కెంతో అవసరం. హాస్యంలేని జీవింతలో నైరాశ్యం ఆవరిస్తుంది. బాధల్ని మర్చిపోయి, హాయిగా తీయగా బ్రతకాలంటే హాస్యం జీవితానికి చాలా అవసరం. హాస్యం కొందరిసొత్తు. కొంతమంది మాట్లాడుతూంటే ప్రతీమాట ఒక హాస్యగుళిక. ప్రతీపదం హాస్యపుజల్లు. ఈచమత్కారం అందరిలో అన్ని కాలాల్లోను ఉండదు. అందర్నీ నవ్వించే శక్తి ఏ కొద్దిమందికో ఉంటుంది. నవ్వాలి నవ్వించాలి కాని నవ్వుల పాలు కాకూడదు. హాస్యం వికటిస్తేనవ్వు రాకపోగా కోపం వస్తుంది. ఏదైన హద్దుల్లో ఉంటేనే ముద్దు. కొంతమందికవి, పండితుల చమత్కారాలు కొన్ని చూద్దాము.

సాహితీ సమరాంగణ సార్వభౌము డైన శ్రీకృష్ణదేవ రాయలభువన విజయసభాభవనానికి చమత్కారనిధి తెనాలి రామలింగడు ఓరోజున ఆలస్యంగా రావటం చూసి రాయలు- 'కవి వృషభులు ఆలస్యంగా వచ్చారే' అన్నారట. అందులోని శ్లేషార్థాన్ని గమనించిన తెనాలి రామలింగడు వ్యంగ్యంగా' కామధేనువువంటి ప్రభువు లుండగా కవి వృషభులకు ఏమిలోటు?' అని సమాధానమిచ్చాడు.

తిరుపతి వేంకటకవుల్ని ఓసభలో 'ఏవండీ, చీకట్లో అరసున్న వుంటుందా' అని అడిగారట ఎవరో. దానికి సమాధానంగా, తిరుపతివారు 'చీకటికదండీ, కనపడటంలేదు' అన్నారు.

సి. వి. సుబ్బన్నశతావధానిగార్ని అప్రస్తుత ప్రసంగంలో ఒకాయన 'బట్టతలలుఎందు కవుతాయండీ' అని ప్రశ్నించారు. మీవంటివారి ప్రశ్నలకు సమాధానం చెప్పలేక తలగోక్కోవటం కావచ్చు' అని సమాధాన మిచ్చారు.

ఇంకోసారి శతావధానం జరుగుతుంటే ఎవరో అప్రస్తుత ప్రసంగంలో 'మనకి ఒకగడ్డం వుంటేనే గీసుకోవడానికి నానాబాధలు పడుతున్నాం. పదిగడ్డాలున్న రావణాసురుడు ఎన్నిబాధలుపడ్డాడంటారు? ' అని అడిగారు. ఆయన సమాధానం వినండి 'పదిగడ్డా లున్నప్పుడు ఇరవైచేతులు కూడా వున్నాయి గదండీ! అయినా రావణాసురుడికి ఆబాధ వుండి వుండదు. దేవతలే ఆ పనిచేసివుంటారు.

పూర్వకాలంలో వేశ్యలకు, పుష్పలావికలకు, కవిత్వం వచ్చేది ఒక కవికుమారుడు వేశ్యావాటికలో ఒక సుందరిని చూశాడు. కాస్సేపు మాట్లాడాలని కుతూహలం కలిగింది కాబోలు. 'తాంబూలంలోకి కాస్తసున్నంశట్రా' అని అనడానికి ఈపద్యం చెప్పాడు.

పర్వతశ్రేష్ఠ పుత్రిక పతి విరోధి
అన్న పెండ్లాము అత్తనుగన్న తండ్రి
ప్రేమతోడుత కన్నట్టి పెద్దబిడ్డ
సున్న మిప్పుడు తేగదే సన్నుతాంగి.

పైకి మాత్రం పొగడుతున్నట్టుగా అనిపిస్తుంది. కానీ అర్థం తెలుసుకొంటే అసలు బండారం బయటపడుతుంది. పర్వత పుత్రిక అంటే పార్వతి అని అర్థం. పార్వతిపతి శివుడు. శివుని విరోధి మన్మథుడు. మన్మథునిఅన్న బ్రహ్మ. బ్రహ్మపెండ్లాము సరస్వతి. సరస్వతీదేవికి అత్తలక్ష్మీదేవి. లక్ష్మిని కన్నతండ్రి సముద్రుడు. సముద్రుడు ప్రేమతో కన్నట్టి పెద్దబిడ్డ అంటే జ్యేష్ఠాదేవి. దారిద్ర్యానికి మారుపేరు జ్యేష్ఠాదేవి. కాబట్టి ఇంతకీ ఆకవికుమారుడు అన్నది 'వోదరిద్రపుకొట్టు పెద్దమ్మా, కాస్తసున్నం పట్రా' అని.

ఆవేశ్యకుకూడా కవిత్వం వచ్చు. ఆతని పద్యంలోనిగూఢార్థాన్ని గ్రహించి అతనిరోగం కుదర్చాలని సున్నం ఇస్తూ అంతకంటె ఘాటుగా ఇలాఅందట.

శతపత్రంబుల మిత్రుని
సుతు జంపినవాని బావ సూనుని మామన్
సతతము తల వాల్చు నతని
సుతు వాహన వైరి వైరి సున్నం బిదిగో!

కవికుమారుడు తానే పెద్దగొప్పవా డనుకున్నాడు. అతను మర్యాదకి 'సన్నుతాంగీ' అని సంబోధించాడు. ఆమె ఆ మాత్రం మర్యాదకూడా కనబరచలేదు.

శతపత్రములు గల తామరపువ్వులకు మిత్రుడు సూర్యుడు. సూర్యుని సుతుడుకర్ణుడు. కర్ణుని చంపినవాడు అర్జునుడు. అతనిబావ కృష్ణుడు. అతని సూనుడు మన్మథుడు. అతనిమామ చందమామ. ఆ చందమామను సతతము తలదాల్చేవాడు శివుడు. శివుని సుతుడు వినాయకుడు. వినాయకుని వాహనం ఎలుక. ఎలుకవైరి పిల్లి. పిల్లివైరి కుక్క. 'వో కుక్కా సున్నంతెచ్చా నిదిగో' అని సారాంశం. చూశారా ఎంత చమత్కారంగా చెప్పిందో.

ప్రఖ్యాత కాంగ్రెస్ నాయకులు అయ్యదేవర కాళేశ్వరరావుగారు చాలా చమత్కారంగా మాట్లాడుతూండేవారు వారిమాటల్లో వ్యంగ్యం, హాస్యం తొంగిచూసేవి. ఒకసారి ఆయన్ని చూడటానికి రావూరు వారు, ఆంధ్రప్రభ సంపాదకులు నీలంరాజు వెంకటశేషయ్య గారు ఆయనింటి కెళ్ళారుట. ఆయన కాస్సేపు పిచ్చాపాటి మాట్లాడాక 'నేనుచైనా మీదొక పుస్తకం వ్రాశానని' చెప్పారు. ఇందులో

చాంకాయ్ షేక్ బొమ్మ వేశాను. ఎందుకో తెల్సా? ఏడ్చిపోతాడని. కొంసేపు సంభాషణ జరిగాక ఇలా అన్నారు. ఈపుస్తకం ఎందుకు వ్రాశానో తెలుసా? అనగా వారిద్దరూ కొన్ని సమాధానాలు చెప్పారు. మీకు చరిత్రరచన అంటే ఇష్టం గనక, అని, చాంకాయ్ షేక్ అంటే మీకు జాలి అనీ, ఇలా నాలుగైదు సమాధానాలు చెప్పారు. అన్నీ కాదని త్రోసిపుచ్చారు. ఏమిటై వుంటుందా అని కారణంఆలోచిస్తున్నారు. ఇద్దరూ గాఢంగా. అప్పుడన్నారు. 'ఎవరైనా చదువుకొంటారః.'

పూర్వాశ్రమంలో ఒక గురువుగారి వద్దకు ఒకవిద్యార్థి వ్యాకరణం నేర్చుకోడానికి ప్రైవేటుకువచ్చాడు. గురువుగారు 'వ్యాకరణం చదివావంటే శబ్దజ్ఞానం వస్తుంది, తర్కశాస్త్రం చదివితే పదార్థజ్ఞానంతో చక్కని ఆలోచనాశక్తి పెరుగుతుంది జ్యోతిష్యం చదివితే భవిష్యత్తు బాగా అవగాహన అవుతుంది. 'ఇలా సర్వశాస్త్రాలను గురించీ చెప్పుతూంటే ఆ శిష్యుని ముఖంలో మార్పు లేదు. రాతిబొమ్మలాకూర్చున్నాడు. అలంకారశాస్త్రం చదువుకుంటావా? అన్నారు గురువుగారు.

అతని ముఖం చేటంత అయింది. "వీడికి అలంకారం ఇష్టంకాబోలు, సాహిత్యం బాగా చదివి ఉంటాడు" అనుకొని ఆ గురువుగారు :

కలువరేకులవంటి కన్నులు, ఇంద్రధనుస్సులా వంగిన కనుబొమ్మలు, దొండపండువంటి అధరం, చంద్రబింబ సదృశమైన వదనం, చిరునవ్వుతో సొట్టలుపడే బుగ్గలు ...... ఇలా ఎంతో అందమైన ఒక అమ్మాయి. ఆ అమ్మాయి ఎంత సుకుమారీ అంటే? మల్లెపూవు కొయ్యడానికి వెడితే ఆ యువతి చేతివ్రేళ్ళు కందిపోయేవి, తెల్లవారితే తలంటు పోసుకోవాలంటే ఈ రాత్రికే ఆమె శరీరం కంపించేది. ఏం చెప్పమంటావు. బాబూ! ఆమె జుట్టు ఎంతపొడుగంటే ఆ కేశపాశం ఆ అమ్మాయి మొయ్యలేనంత బరువుగా ఉంది. — అని గురువుగారు చెప్పుకుంటూ వెడుతున్నారు.

అప్పుడా శిష్యుడు ఇలా అన్నాడు.

"గురువుగారూ! ఒక్కమాట వాళ్ళ తల్లిదండ్రులు మరీ గర్భదరిద్రులా? అన్నాడు. గురువుగారికి అర్థంకాక, అదేమిటి నాయనా? అన్నాడు. అంత దరిద్రులు కాకపోతే అర్ధణాకాసు పారేస్తే ఆ అమ్మాయి మొయ్యలేని బరువైన జుట్టు గీసిపారేస్తాడుకదా పదునుకత్తితో క్షురకుడు, పాపం! ఆ చుట్టుప్రక్కల క్షురకర్మ చేసేవారు కూడ లేరేమో అని జాలిపడ్డాడు. గురువుగారి తల తిరిగిపోయింది. సుదీర్ఘ వినీల కేశపాశం స్త్రీకి అలంకారం అని భావించే భారతదేశంలో ఆ కేశపాశం సమూలంగా గీయించే యువకులకు అలంకార పాఠం ఎలాచెప్పడమని కంటతడిపెట్టారట గురువుగారు.

ఆంధ్రదేశంలో జంటకవులు తిరుపతి వేంకటకవులు అవధానాలద్వారా సాహితీసామ్రాజ్యం పాలిస్తున్న రోజుల్లో దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు, గుర్రం జాషువా గారు, ఇద్దరూ కలిసి జంటకవులుగా, రూపొందాలని ఒకరోజు సమావేశమై, సమాలోచించారట. అయితే కొప్పరపుకవుల మాదిరిగాగాని, తిరుపతి వేంకటకవులవలెగాని పేర్లు ముడిపడలేదు. పూర్వ ఉత్తరపదాలు సరిగా కలవలేదు. పిచ్చి జాషువా అయినా కావాలి, జాషువా పిచ్చి అయినా కావాలి, అందుకని జంటకవులుగా మనడానికి పేర్లు కలవడంలో ఇబ్బందివచ్చి మన పేర్లు పనికిరావని ఎవరికివారుగా వారిపేర్లతో లోకప్రతిష్ఠ సమార్జించుకున్నారు.

ఒకసారి చెళ్ళపిళ్ళవారి అవధానం జరుగుతోంది. ఎవరో అప్రస్తుత ప్రశ్న "రోడ్డుమీద పోయేటప్పుడు నక్క మనకు ఎదురువచ్చి కుడివైపునుంచి ఎడమవైపుకు వెడితే మంచిదా? లేక ఎడమనుంచి కుడికి వెడితే మంచిదా" అన్నాడు. దానికి ఆయన "కరవకుండా అది ఎటునుంచి ఎటువెళ్ళినా ఫర్వాలేదు" అని సమాధాన మిచ్చారు.

ఒకసారి ఎవరిదో (చెళ్ళపిళ్ళవారి దనుకుంటాను) అవధానం జరుగుతుంటే గుర్రం జాషువా అనుకుంటాను అవధానిగారి జేబురుమాలు క్రిందపడటంచూసి చేతికిస్తూ 'మీరు మాలా?'అన్నాడు. ఆయన దానికి గర్వంగా అవునది మాదిగా' అన్నారు.

ఒకసారి చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి మునిమనుమడిని ఎవరో అడిగారట. నీవు కవిత్వం వ్రాయటంలేదు. "నీకు కవిత్వమంటే ఇంట్రస్ట్ లేదా? అని. దానికి అతని సమాధానం "కవిత్వమంటే ఇంట్రస్ట్ లేక కాదు, ఇంటరెస్ట్ లేక" అని.

ఒక్కోసారి ఆలోచిస్తే కవిత్వం వారసత్వమేమో అనిపిస్తుంది. దానికి పైనచెప్పినది ఉదాహరణము.

హాస్యచతుర ఘనాపాఠి, ముక్కపాటివారి మాటలు చమత్కారపు బాటలు. ఒకసారి హైద్రాబాద్‌లో కవిసమ్మేళనం జరిగిందిట. దానికి సుప్రసిద్ధ కవి, పండితులు వచ్చారు. ఆ సమ్మేళనంలో ముక్కపాటికూడా ఉన్నారు. కవితాసభ అయిపోయింది. మన ప్రస్తుత ఆస్థానకవి పొట్టివాడు మహాగట్టివాడు అయిన 'దాశరథి' కూడా సభకు వచ్చాడు. అతనికి ఏవోపనులున్నాయని సభానంతరం వెంటనే వెళ్ళిపోవడానికి సిద్ధంకాగా, ముక్కపాటి నరసింహశాస్త్రి (మొ॥న॥శాస్త్రి) తదితరులు సరదాగా గడపడానికి, ఆరోజు ఉండమని అడిగారు. దాశరథి అంగీకరించలేదు. రైలుకు వెళ్ళిపోతానని హడావిడిగా వెళ్ళిపోయి ఒక పదిహేను నిముసాల తర్వాత మళ్ళీ పెట్టిపుచ్చుకొని తిర్గి వచ్చా వచ్చాడుట. మొ।న। శాస్త్రి ఇలా అడిగారుట "ఏమోయ్, వెనక్కు వచ్చేశే వేమి?

దాశరథి 'రైలు అందలేదు' అన్నాడు.

మొ।న। శాస్త్రి "అందకపోతే కుర్చీపీట వేసుకొని ఎక్కయ్యలేకపోయావా?అని అన్నారుట. దాంతో దాశరథి చిన్నబుచ్చుకొన్నాడు.

ఇలాంటివి మొ॥న॥ శాస్త్రి జీవితంలో అనేకం. ఆయన మాట్లాడే ప్రతిమాట హాస్యపు ఊట. ఆయన జీవితం చమత్కార భరితం.

ఒకసారి మద్రాస్ రైల్వే ప్లాట్ ఫారంమీద మొ॥న॥ శాస్త్రిగారు పచార్లు చేస్తుంటే ఎవరో ఒకకవి (శ్రీశ్రీ అనుకుంటాను) ఏం, ఊరికేనేనా! అన్నారుట. దానికి శాస్త్రిగారు ఊరికేనే అని సమాధాన మిచ్చారట.

మొ॥న॥ శాస్త్రిగారూ, సుప్రసిద్ధకవి, పండితులు, తల్లావఝ్ఝుల శివశంకరస్వామిగారూ వియ్యంకులు. సాహితీసమితి సభ్యులుగా అంతకుముందు చాలాకాలంనుంచీ సన్నిహితులు. వారు కలుసుకొన్నప్పుడల్లా గౌరవంతోకూడిన హాస్యం చిందులాడుతూ వుండేది. వారి ఎకసెక్కాలకు అంతుండేది కాదు. ఎక్కడెక్కడి విషయాలో త్రవ్వి తెచ్చి పరస్పర ఆక్షేపణలకు దిగేవారు.

ఒకసారి శివశంకరశాస్త్రి (స్వామి)గారిలా అన్నారు. "మా శాస్త్రి ఇంగ్లాండు వెళ్ళాడు. తీరా వెళ్ళాక బారిష్టరు చదవడం మాటలు కాదని గ్రహించాడు, బుద్ధిమంతుడు గనక త్వరగా గ్రహించి తిరిగి వచ్చేశాడు. ఏంచేస్తాడూ. అక్కడ పప్పులు ఉడకలేదు ఉడకడంమాట అలావుంచి అసలు ఉమ్మగిల్లలేదుకూడా. ఆ నిప్పులు ఆర్పేసి, ఆ పప్పులు పారబోసి మాతృదేశానికి తిరిగి వచ్చాడు. తెలివిగలవాడు గనక తనబదులు మరో బారిష్టర్ని సృష్టించాడు. దానితో కొట్టుకుపోయింది తనకథ. కొత్తకథ బయల్దేరింది మన పుణ్యమా! అంటూ, అదే 'బారిష్టర్ పార్వతీశం గ్రంథం. ఈ గ్రంథంలో బారిష్టరు అనుభవాలు చాలావరకు శాస్త్రిగారివే. అయితే అవన్నీ పార్వతీశానికి రుద్ది తాము సర్దుకొన్నారు. నిజానికి 'బారిష్టరు మొక్కపాటి' అని పెట్టవలసిందా పుస్తకం పేరు. కాని ఆయనపేరు మార్చారు. పేరు మారిస్తే మాత్రం తీరు మారుతుందా! ఇదంతా చెప్పి శాస్త్రిగారు పకపకనవ్వారు. అంతా శాంతంగావిన్న మొక్కపాటివారు — ఏదో జవాబు చెప్పకపోతే బాగుండదన్నట్టు "బావగారు నన్నుగురించీ, నా గ్రంథాన్ని గురించీ గొప్ప ఉపన్యాసం ఇచ్చారు. ఈయనగారు గురువుగారుకూడా! గురువు ఎంత చెడ్డవాడైనా శిష్యులు ఎదురు చెప్పకూడదు. అసలు గురువు ఎంత చెడ్డవాడైతే శిష్యులకు అంతమంచిది. అయ్యో! గురు విట్లా అయిపోయాడు. మన మన్నా జాగ్రత్త పడదాం - అనిపిస్తుంది. అంతేకాదు. అలాంటి గురువుల్ని మించడం శిష్యులకు అతి తేలిక. అందువల్ల గురువులు చెడ్డవారు కావడం అదృష్టం. అయితే మా గురువుగారి దగ్గర చెడ్డతనం ఏమీ లేదు. కాకపోతే ఒక్కలోపం ఉంది. శిష్యుల్ని బాగుచేస్తారు. పైకి తెస్తారు. వాళ్ళు గొప్పవాళ్లు అయిన తర్వాత బాధపడతారు. ఉదాహరణకు ఇప్పుడుపడ్డ బాధలాంటిదే". అది విని అక్కడవారంతా మరింతగా నవ్వారు.

తర్వాత. తల్లావఝ్ఝులవారిలా అన్నారు: అవును బాధ పడక ఏం చేస్తాం! బారిష్టరు పార్వతీశం లాటి హాస్యగ్రంథం వ్రాసి మొక్కపాటి ఇంకా మొక్కపాటిగానే ఉన్నాడు, మరోదేశంలో అయితే మ్రానుపాటి అయ్యేవాడు. అదీ నేను పడేబాధ. మరి ఇంతవాడికి గురువు నని చెప్పుకొనే సంతోషిస్తున్నాను. ఇంకెంతవాడో అయితే, అంతవాడికి గురువు నని చెప్పుకొని ఇంకెంత గర్వపడేవాణ్ణో? గురువుబాధ అది.

మొక్కపాటివారు మాకు బంధువేకాదు హాస్యసింధువు. మనదేశంలో హాస్యచతురులు అనేకు లున్నారు, అందరిలో కొందరే మనకు చిరస్మరణీయులు. వారిలో మొక్కపాటి వారు, మునిమాణిక్యంవారు, చిలకమర్తివారు ముఖ్యు లని చెప్పవచ్చు.

సమస్యాపూరణంలో ఈ చమత్కారానికి ఎక్కువ ప్రాధాన్య ముంది. అవికూడా రెండు వివరించి ఈ వ్యాసం ముగిస్తాను.

ఒక ఆధునికకవి నల్లిబాధను బాగా చవిచూసి ఒక చాటువు చెప్పాడు.

"శివుడద్రిని శయనించుట
రవిచంద్రులు మింటనుంట, రాజీవాక్షుం
డవిరళముగ శేషునిపైఁ
బవళించుట నల్లిబాధ పడలేక సుమీ.

చాకలివానిపై పద్యమొక్కటి చూడండి.

'చాకివానితోడ జగడాలు పడలేక
సిరిగలాఁడు పట్టుచీర గట్టె
శివుడు తోలుగట్టె, సీయని మదిరోసి
భైరవుండు చీరఁ బాఱవైచె:

పాగ్రత్తాగుడుపై అనేక పద్యాలు వెలిశాయి. అందు ఒకటి అందుకోండి.

మీరుం బొగత్రాగుదురా
వారిజభవ! వామదేవ! వైకుంఠహరీ!
ఓరీ నారద వినురా
యీరేడు జగంబులందు నిది ముఖ్యము రా!

ఒకడు ఇంకొక వ్యక్తితో ఇలా అంటున్నాడు.

మొదటి వ్యక్తి :- ఏరా వైద్యం మానేసావా?
రెండో వ్యక్తి :- మానేశాను, కవిత్వం మొదలెట్టానుగా.
మొదటి వ్యక్తి :- ఏదైతేఏం ప్రజల్ని చంపడానికి.

ఇంకా వ్రాసుకుంటూపోతే పెద్దగ్రంథం తయారవుతుంది. కనుక ఇంతటితో

— సమాప్తి —

## ఈ పక్షంలో

రాజమండ్రి ఆంధ్ర కేసరి యువజన సమితివారు 29-5-78 నుండి వేసవి సాంస్కృతిక పాఠశాలను 4-6-78 వరకు నిర్వహించియున్నారు.

సమితి కార్యాలయంలో ఉదయం 8 గం॥ నుండి 10 గం॥ల వరకు వివిధ విషయములపై నిత్యము మూడుపన్యాసాలు ఏర్పాటు చేయబడినవి.

శ్రీ భాష్యం అప్పలాచార్యులు శ్రీ పోతుకూచి, శ్రీ మధిర, శ్రీ చిలుకూరి, శ్రీ క్రొవ్విడి, శ్రీ కప్పగంతుల, శ్రీ G S. R. మున్నగు ప్రముఖులు తమ మహోన్నత సందేశముల నాయా విషయములపై వినిపించిరి. గవర్నమెంటు ఆర్ట్సు కాలేజీ ప్రిన్సిపాలు శ్రీ ఆర్. యస్. సుదర్శనంగారు పాఠశాల ప్రారంభము గావింపగా; స్థానిక ట్రయినింగు కాలేజీ ప్రిన్సిపాలు ప్రొఫెసరు శ్రీ B S.R. ఆంజనేయులుగారు స్నాతకోత్సవముగావించుట మిక్కిలి సముచితముగా నున్నది.

ఈయేటి వేసవిశ్రమ కోర్చి ఈ కార్యక్రమం నిర్వహించిన సమితివారు, ఉపన్యాస కార్యక్రమంలో పాల్గొన్న పెద్దలూ, విద్యార్థులూ అందరూ అభినందనీయులు. ముఖ్యంగా పై సమితి వారు తరుచుగా నిర్వహిస్తున్న సాంస్కృతిక కార్యక్రమాలు ప్రత్యేక అభినందనీయాలు.

---

* * ఈపక్షంలో ప్రచురింపదలచిన సత్యము - ధర్మము అను వ్యాసం కారణాంతరాలచేత రాబోవుసంచికలలో ప్రచురణకు నిలిపియుంచబడినది. — సం.

## రాజకీయ నాయకులు - దౌర్జన్యకాండ

మాజీ ప్రధాని శ్రీమతి గాంధీ ఒరిస్సా పర్యటన సందర్భంగా జరగిన కల్లోలము గర్హించదగినది. దీనిని పథకం ప్రకారం జనతా కార్యకర్తలు తనపై చేసిన హత్యాప్రయత్నంగా శ్రీమతి గాంధీ ప్రకటిస్తున్నారు. ప్రస్తుతం ఎన్ని గుణదోషములూ నేరారోపణలూ ఉన్నా ఒకపుడు అశేష భారత ప్రజల అనురాగమును చూరగొన్న మహానాయకురాలు శ్రీమతి గాంధీ అన్నది నిర్వివాదం. ఆమెపై రాజకీయంగా హత్యాప్రయత్నం నిజంగా జరగితే జాతికి అంతకంటె కళంకం లేదు.

అయితే రాజకీయాలలో తప్పు ఒకరుచేసి అది యితరులపై నెట్టివేయడానికి ప్రయత్నించడం అసహజంకాదు. శ్రీమతి గాంధీ అనుచరులే అల్లరులకు మూలకారణం అనీ ప్రతిపక్ష నాయకురాలికి ప్రభుత్వ అతిథి గౌరవం యిస్తే అది దుర్వినియోగ పరచబడిందనీ అల్లరులద్వారా హత్యాప్రయత్న ఆరోపణద్వారా ప్రతిష్ఠ పెంచుకొని సానుభూతి సంపాదించుకోడానికి జరగిన ప్రయత్నమే ఇది అనీ జనతా నాయకులు ప్రకటిస్తున్నారు. అదే నిజమయితే మొగుణ్ణి కొట్టి మొగసాలకి మొఱలు పెట్టడం అనే సామెత ఇలాంటి సంఘటనలవల్లనే పుట్టిందనిపిస్తుంది. అంతకంటె మహాదారుణం ఉండబోదు.

ఈవిషయంపై సంపూర్ణ విచారణ జరపి యథార్థం వెల్లడించడం తదధికారుల పరమధర్మం.

— సంపాదకుడు.

Regd. No. H/Rmy-42. Samalochana 16, June. 1978.

# ఈ గ్రంథములు

1) నిర్వచన మహాభారతము (పదునెనిమిది పర్వములు) రు. 50—00
2) నిర్వచన అధ్యాత్మ రామాయణము రు. 20—00
3) నిర్వచన మహాభాగవతము రు. 30—00
4) శ్రీ వేంకటేశ్వర విజయము రు. 25—00
5) కందమాల నాటకము రు. 5—00
6) వేణీ సంహార నాటకము రు. 5—00
7) గీత రామాయణము
   వాల్మీకమునకు గీతములు (అచ్చులో)
8) దేవీ భాగవతము ,,
9) శతక సంపుటములు ఒక్కొక్కటి రు. 5—00

కృతికర్త : ప్రకాశకుఁడు :

**బులుసు వేంకటేశ్వరులు,**
10-5-5 రామారావుపేట కాకినాడ-4.

## —: రచయితలకు మనవి :—

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు విభిన్నాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములలోఁ గాని, శిష్టవ్యావహారికములలోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

వివాదాస్పదములుగాని, చట్టబద్ధమైన, మత, రాజకీయ, ఆర్థిక, శాస్త్రీయ, విజ్ఞాన, పారమార్థిక, సాహిత్యాదులకు సంబంధించి వివిధప్రక్రియలకుఁ జెందిన ఏవిషయములమీఁది రచనలనైనఁ బ్రచురించుట మా యభిలాష.

రచన మాకుఁజేరిన వారమురోజులలోఁ బ్రచురణకు స్వీకరించిన విషయము రచయితలకుఁ దెలుపఁబడును. స్వీకరింపఁబడని రచనలు త్రిప్పిపంపుటకు తగిన తపాలాస్టాంపులు రచనలతోపాటు పంపవలయును.

క్రొత్త పుస్తకములను రెవ్యూకి పంపువారు రెండుకాపీలు పంపఁగలరు. పంపఁబడిన ప్రతి పుస్తకముమీఁదను వీలయినంత వఱకు రెవ్యూ ప్రచురింపఁబడును.

— ఎడిటరు.

అడ్రసు :—

సంపాదకుడు, **బులుసు సీతారామశాస్త్రి,**
Retired Telugu Lecturer, V. T. J. College,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజ నగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.